529

A

ఓం గురవే నమః

శ్రీ

# అద్వైతానుభవము



బ్రహ్మాద్వైత దేశికేంద్ర

**అంగలకుదిటి షణ్ముఖ స్థపతిచే**

విరచితము

కలిగతాబ్దములు

5055 సం॥



జయ సం॥ మాఘ, శుద్ధ, దశమి

1955



వెల: రు **2-0-0**

B

# శ్రీ అద్వైతానుభవము

గురుభక్తుల ద్రవ్య సహాయముచే
ముద్రింపబడినది.

సద్గురువు వీరికి చిత్తశుద్ధి, బ్రహ్మజ్ఞానాభివృద్ధి
గలుగజేయుగాక.

ప్రతులు :
500

ముద్రణ :
జ్యోతీప్రెస్, గుడివాడ.

# విషయసూచిక.


పేజీ

1_గురుస్తోత్రావళి
8_శుద్ధజ్ఞప్తివిచారణ
12_అష్టదళ వ్యవహారము
19_సద్గురునవరత్నపుష్ప పూజా
20_సద్గురునక్షత్రమణిపుష్ప పూజా

పేజీ

1_గురునమస్కారము
1_ వేదఋక్పారాయణము
5_కర్మ (సృష్టి) కాండ
5_దేహకర్మలు
6_బ్రహ్మకర్మలు
8_ వేదకర్మలు
9_శిల్పకర్మాదులు
11_ఉపాసనా (దేవతా) కాండ
12_ఈశ్వరాద్యుపాసనలు
14_జ్ఞాన (బ్రహ్మ) కాండ
14_సద్గురుస్తోత్రకదంబము
17_బ్రహ్మవిద్యాగ్రహీత
18_బ్రహ్మదరిశనము

పేజీ

20_అనుబంధపంచకము
21_సాధనచతుష్టయము
26_వైరాగ్యము
31_గురుమాహాత్మ్యము
35_గురుశిష్యలక్షణములు
38_భక్తిత్రయము
39_పిండోత్పత్తివివరణము
42_గురునమస్కారవివరణము
45_బాహ్యచతుర్విధ శుశ్రూషలు
46_అంతరచతుర్విధ శుశ్రూషలు
46_బాహ్యతాపత్రియములు
47_అంతరతాపత్రయములు
47_ప్రణవాదిమంత్రతనువు
51_చతుర్విధసమాధులు
53_గురుపంచపూజా
54_గురువుదృష్టినిగ్రహించుట
54_శిష్యప్రమాణములు
54_షోడశనామధారణము
55_గురుమంత్రోచ్ఛారణము

| పేజీ | పేజీ |
|---|---|
| 55-కళ్యాణహారతి | 88-పూర్వోత్తరజన్మలు |
| 56-అంతరతీర్థప్రసాదాదులు | 89-పంచగ్రంధిరహితము |
| 57-బాహ్యతీర్థప్రసాదములు | 91-సంఖ్యానామములు |
| 58-ఋషి పంచీకరణము | 105-త్రివాదములు |
| 65-దేవుడెవరు | 105-మదుపాదానములు |
| 66 నవాంతర యోగములు | 106-అష్టకారణములు |
| 67-అంతరముద్రిలు | 107-అష్టభావములు |
| 68-జీవబ్రహ్మైక్యము | 108-ద్వంద్వభావములు |
| 68-దశాంతరసిద్ధులు | 109-వేదోపనిషదాదిప్రమాణములు |
| 70-దేహాంతరదేవతలు | 1 9-గురుపరంపరా హారతి |
| 73-పిండబ్రహ్మాండసంబంధములు | 121-గ్రంథపూర్తి |
| | 121 గద్య |




శ్రీ వేమన గ్రంథాలయమునకు, అంగలకు ।
విబిపిషణ్ముఖశాస్త్రి సమర్పితము, మన్మథ సం॥
శ్రీరామనవమి॥ ది 2-4-1955 సం॥

శ్రీ గురవేనమః

# శ్రీ గురు స్తోత్రావళి

శ్రీ కుందనపు సుబ్బయాచార్య విరచితమ్—

శ్రీ సద్గురు వర్గత్రయ స్తోత్రమ్—

శ్లో॥ శ్రీమన్నిర్గుణ నిర్వికార పరత । త్వం యోగిభిస్సేవితం
సర్వాంతర్బహి రప్యజాండనివహే । సంస్థాయిసత్వప్రభం॥
నిర్మాయావరణం ప్రపూర్ణ విలస । త్ప్రజ్ఞానసచ్ఛిద్ఘనం
ధ్యాయే తంవర తూములూరి కులరా, మార్యాహ్వాయ
శాస్త్రిణం॥ ౧॥

శ్లో॥ శ్రీమద్వేదవచో లసన్మణిగణ । స్నిగ్ధ ప్రభాభాస్వరం॥
కామాద్యంత రరిప్రపంచవిజయం । సద్బ్రహ్మ విన్మానసం॥
అంభస్యాష్టదశాబ్జ వర్తినమహం । సౌపర్ణగోత్రోద్భవం॥
ఆచార్యం హృదిభావయే మదుప సు । బ్బయ్యావధూతం
సదా॥ ౨

శ్లో॥ శ్రీషట్కోశ హిరణ్మయాంతరగతం। లక్ష్యార్థదివ్యాత్మకం
అజ్ఞానాంధతమస్సహస్ర కిరణం బ్రహ్మాండ తేజోమయం
తత్వార్థ ప్రతిపాదకాంగలకుది । వ్యాఖ్యాన్వవాయాంచితం
వందే షణ్ముఖ విశ్వకర్మయతినం। శ్రీసుబ్బమోహాంసదా॥ 3

# ఆచార్య స్తోత్రమ్

శ్లో॥ శ్రీకృష్ణోత్తర తేలప్రోలు నిలయం। పూజ్యైస్సదా సేవితం
విశ్వబ్రాహ్మణ సత్సువర్ణ ఋషి రాట్। గోత్రోద్భవం భాసురం
సమ్యక్ప్రాజ్ఞ సమంచితాంగలక్ష్మి। వ్యాఖ్యాన్య మోదంచితం
శ్రీమత్ షణ్ముఖ నామసంకలిత మా। చార్యం భజేహం
సదా॥ ౧

శ్లో॥ శ్రౌతస్మార్త విధిప్రయోగ నిపుణం। సూత్రార్థసం వేదినం
సత్యజ్ఞాన సదోపదేశకచణం। కామాదిషడ్వర్జితం
ప్రాగ్జన్మార్జిత సంచితాది హననం। బ్రహ్మాండ సంబోధినం
శ్రీమత్ షణ్ముఖశాస్త్రిణం గురువరం। ధ్యాయామి
మన్మానసే॥ ౨

శ్లో॥ నిత్యం నిర్మలినాంతరంగ మనసం। నిర్మోహమధ్యాత్మకం
సర్వాత్మత్వమఖండ పూర్ణమతులం। సత్యస్వరూపోజ్వలం
నైర్గుణ్యం గుణభేదభావరహితం। నిర్వాణసంధాయకం
శ్రీమత్ షణ్ముఖ నామపూర్వఘటితం। ఖ్యాతావధానం
భజే॥ ౩

శ్లో॥ సోహం బ్రహ్మ ఇతి ప్రధానవచనైః। శిష్యాన్సముద్ధారకః
సంబోధ్యాశువినిశ్చలాత్మ విదుషః। కృత్వా సదా పూజితః
సోయం షణ్ముఖదీక్షితో మమగురు। శ్రీమన్మహాధీయుతః
మాధుర్యం మే మనసిస్థితం పరిమృశన్। మాంపాల యత్వాం
జసా॥ ౪

శ్లో॥ శుద్ధబ్రహ్మమయాత్మకం నిగమస । న్మంత్రార్థబోధప్రియం
నీలాభ్రాంతర విద్యుదుజ్జ్వలిత స । న్నివార శూకప్రభం
బోద్ధారంగురు సత్కృపాకలిత సం । పూర్ణత్వ సంసాదకం
శ్రీబ్రహ్మాత్మక షణ్ముఖస్థపతి మా । ర్యం సద్గురుం
భావయే ॥ ౫

శ్లో॥ షట్చక్రోర్ధ్వ సహస్రపత్రకమలే । బ్రహ్మాలయే సూచకం
హంసోహంస మితీవసంస్ఫురణతో । సన్ముక్తి సంధాయినం
ఆనందంహి పరాత్పరేతిపచనై । రద్వైత సద్బోధకం
శ్రీమత్ షణ్ముఖ దేశికాహ్వయ మహం । ధ్యాయామి
మన్మానసే ॥ ౬

శ్లో॥ అవ్యక్తాది దళాంతరాళ విరజం । సూక్ష్మాతి సూక్ష్మంపరం
చిన్ముద్రాంచిత పాణినంగురుపరం । పద్మాసనే భాసురం
శాంతం సర్వమతాభిమాన జనకం । సద్దివ్య తేజోమయం
శ్రీమత్ షణ్ముఖయోగినః పదయుగం । ధ్యాయామి
మన్మానసే ॥ ౭

శ్లో॥ ఓమిత్యక్షర భావగమ్య విభవం । సృష్ట్యాది కృత్యాత్మకం
సుజ్ఞానం పరతత్వ కోపనిషదా । మర్థావబోధాంచితం
నిర్వ్యాజం నిరుపాదికం నిరధికం । నిర్వేదనం నిర్భయం
శ్రీమత్ షణ్ముఖ తీర్థమాత్మనిలయం । ధ్యాయామి
మన్మానసే ॥ ౮

శ్లో॥ దివ్యం యోగసమాధినా నియమితం । నిష్ఠాగరిష్ఠాత్మకం
శిష్టాచార విశిష్ట కుందనపువం । శోద్భూత దైవజ్ఞకః
శిష్యస్సుబ్బయ నామసత్కవిరహం । హృత్పద్మరాజేసదా

శ్రీమత్ షణ్ముఖశర్మ సద్గురు వరం । లక్ష్యార్థమేవం భజే ॥

# ఆచార్యాణీ స్తోత్రమ్

శ్లో॥ శ్రీసౌభాగ్యయుతాం సుశక్తిలలితాం, గౌరీసమాసాకృతిం కళ్యాణీం ఘనశీలసంపదమశే। షానల్పశిల్పక్రియా। చార్యాణీం పరమాత్మతత్వనియుతాం। బ్రహ్మేంద్రసేవారతిం వందే షణ్ముఖ సత్సతీం కనకదు। ర్గాంబా మహామాతరం॥ ౧

శ్లో॥ శ్రీసౌభాగ్య యుతాం ప్రపూజిత పదాం। శిష్యాళిసంపోషిణీం సాధ్వీం సద్గుణభూషితాం విమలసు। శీలాం కళాలంకృతాం శ్రీమద్బ్రహ్మవిచారణైక రసికాం। విజ్ఞాన తేజోమయీం వందే షణ్ముఖ సత్సతీం కనకదు। ర్గాంబా మహామాతరం॥ ౨

శ్లో॥ శ్రీసౌభాగ్య యుతామఖండ విభవా। మాద్యాంశుచిభ్రాజనీం చిద్రూపప్రతిభా మనంతగుణగ। ణ్యాం సర్వచిత్రీకృతా॥ చార్యాణీం శుచిశీలకుందనపువై। శ్రీసుబ్బయాసంస్థితాం వందే షణ్ముఖ సత్సతీం కనకదుర్గాంబా మహామాతరం ॥ 3

# ద్వాదశతీర్థస్తోత్రమ్

శ్లో॥ శ్రీమద్బ్రహ్మ విచారణేసు నిపుణం। దివ్యాత్మసంపూజితం
నిత్యానందకరం సుధీగుణనిధిం । తీర్థం ప్రబోధాత్మకం అంగు
ష్ఠాంతర వాసినం శుచిగిరం । తీర్థోత్తమానేసరం ధ్యాయే
శాంత గుణాంచితం పరమరా । జాలక్ష్మి నారాయణం॥ ౧

శ్లో॥ శ్రీమద్యోగ విరాజితం సురుచిరం , భాషామృతం నిర్మ
లం బ్రహ్మాండాత్మ సుబోధనాగ్రకుశలం । జీవేశ్వరైక్యం
సదా ఊహాపోహ సమర్థనీయ మనఘం।శిష్యాళి బోధప్రియం
తీర్థం లంకల పల్లెఅప్పలవరం । మన్మానసే భావయే॥ ౨

శ్లో॥ శ్రీమత్తారక సుప్రబోధకవరం । రుద్రప్రబోధక్రియం
లక్ష్యార్థప్రతిపాదతాత్మ కలితం ॥ శిష్య ప్రశిష్యైర్యుతం
శృంగాటాగ్రతురీయతుర్య శశినం । సుజ్ఞాన దీపోజ్జ్వలం
వందేహంతువయిల్లరుద్రియవరం । తీర్థంసమాధిస్థితం॥ 3

శ్లో॥ శ్రీ వేదాంతవిముక్తకం విరచిత । శ్రీహంస తత్వప్రభం
పూర్ణానంద విరాజితం హృదిసదా । శిష్యాది పోషప్రియం
సత్యజ్ఞాన మనంతబోధన పరం । తీర్థం సుతేజాత్మకం
వందేహం వరపానుగంటి కులజం।కోటీశ్వరం శాస్త్రిణం॥౪

శ్లో॥ శ్రీనాడీత్రయ మండలాంతరగతం । హంసస్వరూపోజ్జ్వలం
అంతర్యోగసమాధి నిష్ఠనియతం । శిష్యైఘ సత్పూజితం
ఏకాంతస్థలవాసినంచ విదితం । చిద్రూపలక్ష్యాన్వితం
ఆచార్యం త్వభివాదయే గొలితి సుబ్బారాయతీర్థంసదా॥౫

శ్లో॥ శ్రీజ్ఞానామృత బోధకోత్తమగురుం । పీఠాధిపాగ్రేసరం
మాయావిద్య విసృష్టమంచితగుణం । పూర్ణాచలోద్భాసురం
తీర్థం యోగసమాధి లక్ష్యనిపుణం । శిష్యాళిసంసేవితం
శుద్ధాంతఃకరణంచ కొల్లికులజం । శ్రీకోటయార్యంభజే॥ ౬

శ్లో॥ శ్రీతీర్థం శివవిశ్వరూపమతులం । లక్ష్యార్థభావప్రియం
సోహంభావమనుష్ఠితం హృదిసదా। హ్యార్యాగుశోకప్రభం
శిష్యోత్తీర్ణ ముదంచితం పరమహం । సాఖండ లక్ష్యాన్వితం
వందే తీర్థమతాధిపం యతిచిదా । నందప్రభుందేశికం॥ ౭

శ్లో॥ శ్రీమత్పశ్చిమ చక్రమధ్యవిలస । ద్వాగీశ్వరీరూపిణీం
చిద్రూపాం పరదేవతాం విజయినీం । శిష్యాళిపూజాన్వితాం
సూర్యాచంద్రమసాగ్రణీం భగవతీం। చిచ్ఛక్తిరూపాత్మికాం
వందేహం గిరిరాజవంశ జననీం। తీర్థాం మహాలక్ష్మికాం॥ ౮

శ్లో॥ శ్రీబోధామృత దేశికేంద్ర మహిమం। గుర్వాశ్రమాధిష్ఠితం
యోగానంద విరాజితం శివగురుం । విజ్ఞానశిష్యాన్వితం
హృత్పద్మాంతర వర్తినం భువిసదా । దుర్గాసివంశోద్భవం
వందేహం వర వెంకయార్యమభయం। తీర్థంముదామానసే॥ ౯

శ్లో॥ శ్రీమత్ జ్ఞాననిరూప దివ్యనయనం । శిష్యోపదేశప్రియం
గుర్వారాధన మాదికోశరచితం । తీర్థంప్రబోధాంచితం
అంతర్లక్ష్య పరాయణాంగలసది। వ్యాఖ్యాన్వ యోద్దీపితం
వందేత్వా మవధూత షణ్ముఖమహం। బ్రహ్మాలయాధిష్ఠితం॥ ౧౦

శ్లో॥ శ్రీభక్తాళి సంప్రబోధవిమలా । నందామృతోద్వర్షిణాం
మూర్ధ్నోద్భూత సుతేజపుంజలసితం । మేధానిధింపూజితం

సద్వ్యాఖ్యార్ణ సమాధినిష్ఠనిపుణం । తీర్థాభిషేకాన్వితం
తత్త్వాలోకన కోలవెన్ను సుపర । బ్రహ్మోర్యతీర్థంభజే॥ ౧౧

శ్లో॥ శ్రీగంగాదినదీ ప్రవాహతరణీం, మాయాపహంత్రీశ్వరీం
సద్బోధామృత తేజరూపసహితాం ॥ శిష్యాళిసంవేష్ఠితాం
సూక్ష్మార్థోద్ధతి రోధినీం శివకరీం । వాగ్దేవతారూపిణీం
వందే యక్కల పున్నమాంబ సుమతీం । తీర్థాంప్రచారా
న్వితాం॥ ౧౨

శ్లో॥ శ్రీసచ్చిత్పరమాత్మతత్త్వ విదుషో । వేదాంత పీఠాధిపాన్
ఏతద్ద్వాదశ సంఖ్యకాన్ గురువరాన్ । సంస్తుత్య తేషాంగుణం
ఆచార్యాం వరబోధకం మదుపు సు । బ్రహ్మణ్యసద్దేశికం
సద్భక్త్యాగ్రథితంతుకుందనపువై । శ్రీసుబ్బయాఖ్యేనతత్ ॥౧౩

శ్రీ గురుస్తోత్రావళి సమాప్తమ్.

శ్లో॥ తత్త్వజ్ఞాన కళావిలాస విలస । చ్ఛ్రీవారణాస్యన్వయం
బ్రహ్మానంద సుధాప్రధాన నిరతం । సద్బోధనాకౌశలం
శాంతంముక్తి పదప్రదర్శనరతం । ధీమన్మహోదంచితం
శ్రీమంతం గురుమాంజనేయ తిలకం ।వందే పవిత్రాత్మకం॥

శ్లో॥ వారణాసికులోద్భూతం । శ్రీయాంజనేయ దేశికం
శాంతోపేతం మహాత్మానం । వందే వేదాంతబోధినం॥

శ్లో॥ కౌసనం వంశసంభూతం । వీరయార్యం భజేసదా
శిష్యప్రబోధనిరతం ! బిందుబ్రహ్మ ప్రతిష్ఠితం॥

శ్లో॥ యలమర్తికులేజాతాం, శేషాంబాం బ్రహ్మవాదినీం
గురుపూజా రతం నిత్యం । సుశీలాం ప్రణమామ్యహం॥

---

7B

ఓం.

సత్యంవద - ధర్మంచర

అహింసా పరమోధర్మః



మాతృవత్పరదారాశ్చ



శ్రీమన్నడుపు సుబ్బయాచార్య
దేశికేంద్రుల వారు.

శ్రీ గురవేనమః

శ్రీమన్నముపు సుబ్బయాచార్య దేశికేంద్రులవారి విరచితము.

# శుద్ధజ్ఞప్తి విచారణ.

సద్గురు:- శుద్ధజ్ఞప్తియనగా నెటువంటిది-

శిష్యా:- నా, యను వాక్యమునకు అతీతమైన జ్ఞప్తి మాత్ర కళా విశేషితమైన వస్తువిస్తారమును చెప్పెద నేకాగ్ర చిత్తుండవై వినుము-

నిరవధికశూన్యమైన ఆకాశము ॥౧॥ గాఢాంధకారమైన మహదాకాశము ॥౨॥ ప్రళయానలరూపమైన పరాకాశము ॥3॥ అతిద్యుతి ప్రపంచమయమైన తత్వాకాశము ॥౪॥ రవికోటిసంకాశమైన సూర్యాకాశము ॥౫॥ అనే పంచాకాశములకతీతమై బ్రహ్మాండాది భువనములలో వెలిగాయే కాకారమై శుద్ధజ్ఞప్తి మాత్రమై యుండును.

అని శ్రీ గురుమూర్తి చెప్పగా పులకాంకిత శరీరుండై ఓస్వామి యిట్లు వాచామగోచరమైన జ్ఞప్తిమాత్ర విశేషమైన అద్వయ బ్రహ్మమందు పిండాండ బ్రహ్మాండములనెడి భేదాభేదములైన విధమెట్టిదనిన వినయపూర్వకముగా నడుగగా శిష్యుని గ్రాహ్యబుద్ధికి మెచ్చి వినవోయి శిష్యా పంచాకాశములకు అతీతమైన పరదేశమందు భాసరహితమైన నిరాభాసమనెడి యొక వృక్షముగలదు. ఆవృక్షముయొక్క క్రమమెట్లనిన అనాదియనే మూలము అనామాక్షరమనే కంద అనిర్వాహమనే

శాఖ నిర్వాసనమైనదే పుష్పము. ఆపుష్పమునందు శుద్ధతెలివి యనే రసము ప్రతిఫలించుచుండును, ఆఫలమందు సుధేయమనే సారము వర్తించుచుండును. ఆసారమునకు అపరిమితాద్వయానందమనే యొక పక్షి పూర్వోక్తమైన రసాస్వాదనంబు నవలంబించుకొనియుండును. ఆపక్షియొక్క వుత్పత్తిక్రమం యేలాగంటే అనామమనే తండ్రి అనంతనామమనే తల్లి యీ స్త్రీపురుష సంయోగమువలన నిరావరణమనే అండము వుత్పత్తి ఆయెను. ఆనిరావరణమనే అండము వికసింపగా ఆయండమునందు అపరిమితాద్వయానందమను యొకపక్షి జననమాయెను. యీపక్షి పూర్వోక్తమైన ఫలమును ఆరోగించి ఆశుద్ధ తెలివియనే అమృతరసమును సేవించి ఆమోదశక్తివలన పరవశమై ఆశుద్ధ తెలివిప్రకాశమువల్ల ఆనందశక్తి అతిశయమై ఆపక్షి పక్షముల విసరును, ఆరెక్కలను విసరినంత బ్రహ్మాండ భాండంబులు పింఛాండ తండోపతండములు వల్లను వుత్పత్తిస్థితి యనంతకల్పాంతములై యొప్పుచుండును. అట్లా అనేక కోటి బ్రహ్మప్రళయములయినా ఆపక్షి పక్షములను విసరినమాత్రములోనే ఉండును. అని శ్రీ గురుమూర్తి చెప్పగా శిష్యుండు ఓగురుస్వామి యీపక్షములను వివరముగా నాయొక్క సంశయ రహితమయ్యేలాగున నాకు తీయవలయునని ప్రార్థింపగా గురుమూర్తి యిట్లనియె.

పూర్వోక్తమైన పక్షికి వామదక్షిణములని ఉభయపక్షంబులుగలవు. వీటిలో దక్షిణపక్షమే తత్పదార్థమని వామపక్షమే త్వంపదార్థమని యీ వుభయపక్షములందు ఉండేపక్షియే అసిపదార్థము. దక్షిణపక్షమే పురుషుడు. వామపక్షమే ప్రకృతి. దక్షిణపక్షమే అకారం. వామపక్షమే ఉకారం. ఆమధ్యవుండే

పక్షియేమకారము. అని చెప్పంబడెను. ఇట్లు గురుమూర్తి ఆన తీయగా శిష్యుండు లేచి ప్రదక్షిణపూర్వకంబుగా నమస్కారము జేసి స్వామీ అకారమే దక్షిణభాగం, ఉకారమే వామభాగం మకారమే మధ్యదేశము. అనతిచ్చితిరి. యీ అకార ఉకార, మకార లక్షణములు నానతీయవలయునని వేడుకొనగా గురు మూర్తి యిట్లనియె.

వినవోయి శిష్యా, ఆసిపదరూపమైన పక్షియొక్క మధ్య దేశమందు పూర్వోక్తమైన శుద్ధ తెలివియనే ఫలరసాస్వాద నంబు గలుగనయ్యె. సుఖమైన అకార పూర్వోక్తమైన శుద్ధ తెలివిగలదు. యీ శుద్ధ తెలివికి జ్ఞప్తి చేతనములు లేవుగనుక ఆశుద్ధజ్ఞప్తి ఫలరసమే ఊహామాత్రంబుగా తోచగా ఉకార పూర్వోక్తమైన చేతనములు గలిగియుండెను. యీ అకారఉకా రములగు సిరెంటికిని ఒకటిలో వకటిలేనిదై రెండుఅక్షరములను భేదమైతే తెలివిచేతనములు గూడనందున తెలివికిని చేతనానికిని సంబంధముండవలసి పూర్వోక్తమైన శుద్ధతెలివియను ఫలరసా స్వాదమే బిందురూపమై మకారమే ఉభయమధ్యయందున్నం దువలన యీ ఉభయ పదములకు తెలివియు చేతనములు గలిగి యుండును. ఇదియే ప్రణవ మనిపించుకొనును. ఇదియే శుద్ధ ప్రణవమని చెప్పబడును. పరమహంసయనియు సోహమనియు మనోన్మణియనియు పర్యాయ నామంబులు గలవు

శ్లో॥ 2॥ అ౦॥ ఉత్తరగీత॥ కాకీముఖ కకారాన్త మకారశ్చేతనాకృతిః। మకారస్యతు లుప్తస్య కోఽర్థః సంప్రపద్యతే టీ॥క॥

కాకీము ఖకకారాన్తం = కాకియను పదాన్తమునందుండు అకారము జీవ (విరాట్) స్వరూపము, ఉకారః = ఉకారము చేతన

(హిరణ్యగర్భ) స్వరూపము, మకారస్య = మకారమనెడి అవ్యా కృతమునను, లుప్తస్యచ - లోపముకలుగగా, కో + + పద్యతే కః = ఏ అర్థః = అర్థము, సంప్రతిపద్యతే = పొందబడుచున్నది.

తాత్పర్యము:-క-అక, అనునది కాకి అనబడును. కాకి యనగా జీవుడు, మఱియు ఆకాకియొక్క ముఖమందు (ఆది యందు) గల కకారము కడపటనుండు అకారముచే విరాట్టనబడును. కాకీముఖశబ్దమునందలి మకారమునీాదనుండు ఉకారము చేతన మైన హిరణ్యగర్భ సరూప (వాచక) మగుచున్నది. మఱియు ఈ కాకీముఖశబ్దమునందలి ఉకారమునకు ముందుండు మకారము అవ్యాకృత మనబడును. ఉకారమునందు అకారమును, మకా కారమునందు ఉకారమును, ఓంకారమునందు మకారమును, ఐక్యమైన పిదప అర్థానినే పదార్థమని చెప్పవలయుననగా అఖం డానందాద్వైత సచ్చిదానంద రూపలక్ష్యార్థమైన బ్రహ్మమే ఆపదార్థమని చెప్పవలయును. కావున ఈప్రణవైక్యాను సంధా నమును చేయువాడు ఆబ్రహ్మమును పొందుచున్నాడు ఇట్టి ప్రమాణములంబట్టి అకార ఉకారమును రెండక్షరములకు మకారము అయిక్యరూపము చెప్పవలయును. అని గురుమూర్తి చెప్పగా శిష్యుండు స్వామీ అకార ఉకారమనే పురుషప్రకృతి త్వంపద తత్పదములనెడి యీావుభయ పక్షములవల్లనైన కార్య కారణములను అజ్ఞాపించవలయునని ప్రార్థించగా శ్రీ గురువు యిట్లనియె.

ఓశిష్యా, ఈపక్షద్వయలక్షణమును వివరముగా ననుభ వరీతిగాదొల్లి చెప్పినవారును అన్నవారును లేరు. నీవునిర్మలమతివై వినుము. దక్షిణపక్షమున పురుషరూపమైనందువల్ల పూర్వోక్త

మైన సూక్ష్మనాదమే అక్షరత్రయములందు అకారమై పురుష బీజమై ఉకారమే శక్తిబీజమైనందువల్ల అకారాక్షర పురుషుండు శుద్ధ తెలివియనే రసాస్వాదనంబువలన గామాతురుండై సకారంబైన శక్తితో సంయోగము చేయగా అకారంబునకు హకారంబు పరముగుచున్నది గనుక అవయవరూపమైన హయనే వర్ణమాయెను. దీనికి దృష్టాంతరము లోకంబులో సతీపతి సంయోగింబున పురుషుని శుక్లం బధికమాయెనేని మొగశిశువును స్త్రీశోణితము హెచ్చిన ఆడశిశువు బుట్టును. ఇట్లు గర్భ దృష్టాంతమువలన హయనే సదా శివాత్మకమయిన బీజము అయివున్నది. ఆప్రకారమందు ఉకారమనే స్త్రీ ఆపురుషుని యందు యిచ్ఛయించగా స యనే శక్తిబీజమాయెను. ఈ స్త్రీ పురుషులకు గూడికనియ్యే సుఖము అశుద్ధ బిందువే ఉభయ మధ్యస్థలమందు నిలకడ యనిపించుకొని హంసయనే నామమాయెను. ఇతడు జీవహంసయని తుర్యహంసయని యనిపించుకొనును.

---

శ్రీమన్మదుపు సుబ్బయాచార్య దేశికేంద్రులవారి రచితము.

## అష్టదళ వ్యవహారము

(1) అన్నిటికి మధ్యగావున్న పరిజ్ఞానముయితే కలదో ఆప్రజ్ఞానముయొక్క సత్తా అవ్యక్తదళమందు పడి అంతఃకరణ రూపమై నాడిద్వారా దిగి హృదయమునకు తాకి ప్రాజ్ఞుడు ప్రేరేపణచేత సమస్తసుషుప్తులు తెలుసునునే జ్ఞానము యేజ్ఞానమో అజ్ఞానము పరిజ్ఞానము ఆప్రజ్ఞానము నేను-

(1) సమస్తసుషుప్తులు వాచ్యార్థము ప్రాజ్ఞుడు లక్ష్యార్థము ప్రాజ్ఞుడు వాచ్యార్థము హృదయము లక్ష్యార్థము హృదయము వాచ్యార్థము నాడీలక్ష్యార్థము నాడీవాచ్యార్థము అంతఃకరణ లక్ష్యార్థము అంతఃకరణ వాచ్యార్థము అవ్యక్తదళము లక్ష్యార్థము అవ్యక్తదళము వాచ్యార్థము సత్తా లక్ష్యార్థము సత్తావాచ్యార్థము ప్రజ్ఞానము లక్ష్యార్థము అలక్ష్యార్థము నేను-

(2) అన్నిటికి మధ్యగావున్న ఏప్రజ్ఞానమయితేకలదో ఆప్రజ్ఞానముయొక్క సత్తా మహద్దళమందుపడి అంతఃకరణ రూపమై నాడీద్వారా దిగి కంఠమునకుతాకి తైజసుడు ప్రేరేపణచేత సమస్తస్వప్నములు తెలుసుకునేజ్ఞానము యేజ్ఞానమో ఆజ్ఞానము ప్రజ్ఞానము అపరిజ్ఞానము నేను-

(2) సమస్త స్వప్నములు వాచ్యార్థము తైజసుడు లక్ష్యార్థము తైజసుడు వాచ్యార్థము కంఠము లక్ష్యార్థము కంఠము వాచ్యార్థము నాడీలక్ష్యార్థము నాడీవాచ్యార్థము అంతఃకరణ లక్ష్యార్థముఅంతఃకరణ వాచ్యార్థము మహద్దళము లక్ష్యార్థము మహద్దళము వాచ్యార్థము సత్తాలక్ష్యార్థము సత్తావాచ్యార్థము ప్రజ్ఞానము లక్ష్యార్థము అలక్ష్యార్థము నేను-

(3) అన్నిటికి మధ్యగావున్న ఏప్రజ్ఞానమయితే కలదో ఆప్రజ్ఞానముయొక్క సత్తా అహంకారదళమందుపడి అంతఃకరణ రూపమై నాడీద్వారా దిగి ఆజ్ఞేయస్థానము తాకి విశ్వుడు ప్రేరేపణచేత సమస్త జాగ్రతలు తెలుసుకునేజ్ఞానము యేజ్ఞానమో ఆజ్ఞానము ప్రజ్ఞానము, అప్రజ్ఞానము నేను.

(3) సమస్త జాగ్రతలు వాచ్యార్థము, విశ్వుడు లక్ష్యార్థము, విశ్వుడు వాచ్యార్థము, ఆజ్ఞేయము లక్ష్యార్థము, ఆజ్ఞేయము వాచ్యార్థము, నాడీలక్ష్యార్థము నాడీవాచ్యార్థము, అంతఃకరణ లక్ష్యార్థము, అంతఃకరణ వాచ్యార్థము, అహంకార దళము లక్ష్యార్థము, అహంకారదళము వాచ్యార్థము, సత్తా లక్ష్యార్థము, సత్తావాచ్యార్థము, ప్రజ్ఞానము లక్ష్యార్థము, ఆలక్ష్యార్థము నేను.

(4) అన్నిటికి మధ్యగావున్న ఏప్రజ్ఞానమయితేకలదో ఆప్రజ్ఞానముయొక్క సత్తా ఆకాశదళమందుపడి. అంతఃకరణ రూపమై నాడీద్వారాదిగి చెవుకితాకి సదాశివుడు ప్రేరేపణచేత సమస్తశబ్దములు తెలుసుకునేజ్ఞానము యేజ్ఞానమో ఆజ్ఞానము ప్రజ్ఞానము ఆప్రజ్ఞానము నేను.

(4) సమస్త శబ్దములు వాచ్యార్థము, సదాశివుడు లక్ష్యార్థము, సదాశివుడు వాచ్యార్థము, చెవ్వు లక్ష్యార్థము, చెవ్వు వాచ్యార్థము, నాడీలక్ష్యార్థము, నాడీ వాచ్యార్థము, అంతఃకరణ లక్ష్యార్థము, అంతఃకరణ వాచ్యార్థము, ఆకాశ దళము లక్ష్యార్థము, ఆకాశదళము వాచ్యార్థము, సత్తాలక్ష్యార్థము, సత్తావాచ్యార్థము, ప్రజ్ఞానము లక్ష్యార్థము ఆలక్ష్యార్థము నేను.

(5) అన్నిటికి మధ్యగావున్న ఏప్రజ్ఞానమయితే కలదో ఆప్రజ్ఞానముయొక్క సత్తా వాయుదళమందుపడి అంతఃకరణ రూపమై నాడీద్వారాదిగి చర్మమునుతాకి మహేశ్వరుడు ప్రేరే

పణచేత సమస్తస్పరిశలు తెలుసుకునే జ్ఞానము యేజ్ఞానమో ఆజ్ఞానము ప్రజ్ఞానము, అపరిజ్ఞానము నేను.

(5) సమస్తస్పరిశలు వాచ్యార్థము, మహేశ్వరుడు లక్ష్యార్థము, మహేశ్వరుడు వాచ్యార్థము, చర్మము లక్ష్యార్థము, చర్మము వాచ్యార్థము, నాడీ లక్ష్యార్థము, నాడీ వాచ్యార్థము, అంతఃకరణ లక్ష్యార్థము. అంతఃకరణ వాచ్యార్థము వాయుదళము లక్ష్యార్థము, వాయుదళము వాచ్యార్థము, సత్తా లక్ష్యార్థము, సత్తా వాచ్యార్థము, అప్రజ్ఞానము లక్ష్యార్థము, అలక్ష్యార్థము నేను.

(6) అన్నిటికి మధ్యగావున్న ఏప్రజ్ఞానమయితే కలదో ఆప్రజ్ఞానముయొక్క సత్తా అగ్నిదళమందుపడి అంతఃకరణ రూపమై నాడీద్వారాదిగి నేత్రములకుతాకి రుద్రుడు పేరేపణ చేత సమస్తరూపములు తెలుసుకునేజ్ఞానము యేజ్ఞానమో ఆజ్ఞానము ప్రజ్ఞానము, అప్రజ్ఞానము నేను.

(6) సమస్తరూపములు వాచ్యార్థము, రుద్రుడు లక్ష్యార్థము, రుద్రుడు వాచ్యార్థము, నేత్రము లక్ష్యార్థము, నేత్రము వాచ్యార్థము, నాడీలక్ష్యార్థము, నాడీవాచ్యార్థము, అంతఃకరణ లక్ష్యార్థము. అంతఃకరణ వాచ్యార్థము, అగ్నిదళము లక్ష్యార్థము, అగ్నిదళము వాచ్యార్థము, సత్తా లక్ష్యార్థము, సత్తా వాచ్యార్థము, ప్రజ్ఞానము లక్ష్యార్థము, అలక్ష్యార్థము నేను.

(7) అన్నిటికి మధ్యగావున్న ఏపరిజ్ఞానమయితే కలదో ఆపరిజ్ఞానముయొక్క సత్తా జలదళమందుపడి అంతఃకరణరూపమై నాడీద్వారాదిగి, జిహ్వకుతాకి, విష్ణువు పేరేపణచేత సమస్త

రుచులను తెలుసుకునే జ్ఞానము యేజ్ఞానమో ఆజ్ఞానము ప్రజ్ఞానము ఆప్రజ్ఞానము నేను.

(7) సమస్తరుచులు వాచ్యార్థము, విష్ణువు లక్ష్యార్థము, విష్ణువు వాచ్యార్థము, జిహ్వ లక్ష్యార్థము, జిహ్వ వాచ్యార్థము, నాడీలక్ష్యార్థము, నాడివాచ్యార్థము, అంతఃకరణ లక్ష్యార్థము, అంతఃకరణ వాచ్యార్థము, జలదళము లక్ష్యార్థము, జలదళము వాచ్యార్థము, సత్తా లక్ష్యార్థము, సత్తావాచ్యార్థము, ప్రజ్ఞానములక్ష్యార్థము, ఆ లక్ష్యార్థము నేను.

(8) అన్నిటికి మధ్యగావున్న ఏప్రజ్ఞానమయితే కలదో ఆప్రజ్ఞానముయొక్క సత్తా పృధివిదళమందుపడి అంతఃకరణ రూపమై నాడీద్వారాదిగి నాసికమునకు తాకి బ్రహ్మప్రేరేపణ చేత సమస్తగ్రంధములను తెలుసుకునేజ్ఞానము యేజ్ఞానమో ఆజ్ఞానము ప్రజ్ఞానము, ఆప్రజ్ఞానము నేను.

(8) సమస్తగంధములు వాచ్యార్థము, బ్రహ్మ లక్ష్యార్థము, బ్రహ్మ వాచ్యార్థము, నాసికము లక్ష్యార్థము, నాసికము వాచ్యార్థము, నాడీలక్ష్యార్థము, నాడీ వాచ్యార్థము, అంతఃకరణ లక్ష్యార్థము, అంతఃకరణ వాచ్యార్థము, పృధివిదళము లక్ష్యార్థము, పృధివిదళము వాచ్యార్థము, సత్తా లక్ష్యార్థము,సత్తా వాచ్యార్థము.ప్రజ్ఞానము లక్ష్యార్థము ఆలక్ష్యార్థము నేను.

(1) అవ్యక్తదళమునకు హృదయమునకు సంబంధము. యెలాసంబంధమనగా అవ్యక్తదళ సంబంధమైనదే హృదయము

అవ్యక్తదళసంబంధమైనదే సుషుప్తి, అందువల్ల హృదయము ద్వారా సుషుప్తిని తెలుసుకొనుటకు కారణమయినది.

(2) మహద్దళమునకు కంఠమునకు సంబంధము, యెలా సంబంధమనగా మహద్దళసంబంధమైనదే కంఠము. మహద్దళ సంబంధమైనదే స్వప్నము, అందువల్ల కంఠముద్వారా స్వప్నము తెలుసుకొనుటకు కారణమయినది,

(3) అహంకారదళమునకు ఆజ్ఞేయమునకు సంబంధము. ఎలా సంబంధమనగా అహంకారదళ సంబంధమైనదే ఆజ్ఞేయము అహంకారదళసంబంధమైనదే జాగ్రత, అందువల్ల ఆజ్ఞేయము ద్వారా జాగ్రతను తెలుసుకొనుటకు కారణమైనది.

(4) ఆకాశదళమునకు చెవునకు సంబంధము, యెలా సంబంధమనగా ఆకాశదళ సంబంధమైనదే చెవ్వు, ఆకాశదళ సంబంధమైనదే శబ్దము. అందువల్ల చెవ్వుద్వారా శబ్దమును తెలుసుకొనుటకు కారణమైనది.

(5) వాయుదళమునకు చర్మమునకు సంబంధము, యెలాసంబంధమనగా వాయుదళ సంబంధమైనదే చర్మము, వాయుదళసంబంధమైనదే స్పర్శ, అందువల్ల చర్మముద్వారా స్పరిశను తెలుసుకొనుటకు కారణమయినది.

(6) అగ్నిదళమునకు నేత్రమునకు సంబంధము, యెలా సంబంధమనగా అగ్నిదళసంబంధమైనదే నేత్రము, అగ్నిదళ

సంబధమైనదే రూపము, అందువల్ల నేత్రముద్వారా రూపమును తెలుసుకొనుటకు కారణమయినది.

(7) జలదళమునకు జిహ్వాకు సంబంధము, యెలా సంబంధమనగా జలదళసంబంధమైనదే జిహ్వా, జలదళసంబంధమైనదే రసము, అందువల్ల జిహ్వాద్వారా రసమును తెలుసుకొనుటకు కారణమైనది.

(8) పృథివిదళమునకు ముక్కుకు సంబంధము, ఎలాసంబంధమనగా పృధివిదళ సంబంధమైనదే నాసిక, పృధివిదళసంబధమైనదే గంధము, అందువల్ల ముక్కుద్వారా గంధమును తెలుసుకొనుటకు కారణమైనది.

(1) ఆప్రిజ్ఞానముసత్త, మబ్బురంగుగల, మాయా అద్దమందు పడుటవల్ల, హృదయముద్వారా, సుషిప్తిని తెలుసుకొనుటకు కారణమైనది.

(2) ఆప్రిజ్ఞానముసత్త, తెలుపులో పసుపురంగుగల, చంద్ర అద్దమందు పడుటవల్ల, కంఠముద్వారా, స్వప్నమును తెలుసుకొనుటకు కారణమైనది.

(3) ఆప్రిజ్ఞానముసత్త, యెరుపులో తెలుపురంగుగల, సూర్య అద్దమందు పడుటవల్ల, ఆజ్ఞేయముద్వారా, జాగ్రితను తెలుసుకొనుటకు కారణమైనది.

(4) ఆప్రిజ్ఞానముసత్త, పూదారంగుగల, ఆకాశ అద్దమందు పడుటవల్ల చెవ్వుద్వారా శబ్దమును తెలుసుకొనుటకు కారణమైనది.

(5) ఆప్రిజ్ఞానముసత్త, ఆకుపచ్చరంగుగల, వాయు అద్దమందు పడుటవల్ల, చర్మముద్వారా స్పరిశను, తెలుసు కొనుటకు కారణమైనది.

(6) ఆప్రిజ్ఞానముసత్త, యెరుపురంగుగల, అగ్నిఅద్ద మందు పడుటవల్ల, నేత్రిముద్వారా రూపమును తెలుసుకొను టకు కారణమైనది.

(7) ఆప్రిజ్ఞానముసత్త, తెలుపురంగుగల, జలఅద్ద మందు పడుటవల్ల, జిహ్వాద్వారా రసమును, తెలుసుకొనుటకు కారణమయినది.

(8) ఆప్రిజ్ఞానముసత్త, పసుపురంగుగల, పృథివి అద్ద మందు పడుటవల్ల, ముక్కుద్వారా గంధమును, తెలుసుకొను టకు కారణయినది.

అష్టదళ వ్యవహారము సమాప్తం

---

శ్రీమత్పానుగంటి కోటీశ్వరశాస్త్రి విరచితము.

## సద్గురు నవరత్న పుష్పపూజా.

(1) ఓం. శ్రీమద్వేగాగమోక్త విరాడ్విశ్వ బ్రహ్మ ముఖో ద్భవ। విశ్వబ్రాహ్మణ సద్గురవేనమః

(2) ఓం. సుపర్ణసగోత్రి సంజనితాయనమః

(3) ఓం విశ్వజ్ఞసూత్రప్రణవశాఖాయనమః

(4) శ్రీమన్మడుపు వంశాంబుధి సుధాకరాయనమః

(5) శ్రీమద్గుంటూరు పురవేదాంత పీఠాధ్యక్షాయనమః

(6) శ్రీ శేషమాంబా శోభనాద్యాచార్య పుత్రాయనమః

(7) శ్రీయచ్చమాంబా ప్రాణేశ్వరాయనమః

(8) శ్రీమద్గోవిందమాంబా విశ్వజ్ఞాచార్య జనకాయనమః

(9) శ్రీమత్స్వాములూరి రామశాస్త్రి సద్గురుదత్త గురుపట్టాధికార విరాజమాన గురుసింహాసనాధ్యక్షాయ నమః

---

## సద్గురునక్షత్రమణి పుష్పపూజా.

(1) శ్రీధరస్వామి దేశికేంద్ర సాంప్రదాయక పరంపరాయనమః ఓం

(2) శ్రీమత్స్వాములూరి రామశాస్త్రిదేశికేంద్ర దత్తగురుపట్టాధరాయనమః ఓం.

(3) శ్రీమన్మడుపు సుబ్బయాచార్య సద్గురు పరబ్రహ్మణే నమః ఓం.

(4) యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధ్యంత రాష్టాంగయోగానుష్ఠాన నిష్ఠాగరిష్ఠాయనమః ఓం.

(5) భూతిగంధాక్షత రుద్రాక్షమాలా పాదుకా ధరాయ నమః ఓం.

(6) సువర్ణయజ్ఞోపవీత రత్నకుండల ధరాయనమః ఓం.

(7) పిండబ్రహ్మాండ సంబంధబోధార్ణవ సుధాకరాయనమఃఓం

(8) పిండబ్రహ్మాండ పంచీకరణ సిద్ధాన్త సమర్థాయనమః ఓం

(9) ప్రజ్ఞానానుభవ సూత్ర రత్నావళి కర్తృణేనమః ఓం

(10) శ్రీమదష్టదళ పద్మనివాస గుహాగూఢ సూచనగురవే నమః ఓం.

(11) చతుర్విధ సగుణనిర్గుణ మహావాక్య రహస్యార్థబోధినే నమః ఓం.

(12) జీవేశ్వరప్రత్యగాత్మ పరమాత్మానుభవార్థ బోధినేనమఃఓం

(13) సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యానుభవ బోధినేనమః ఓం.

(14) శ్రీహంసతత్వ కందార్థ రహస్యార్థ వేదినేనమః ఓం

(15) శ్రీమత్త్రిశత శిష్యసంపూజిత సౌవర్ణపాదుకాయనమఃఓం

(16) శ్రీస్థూలప్రణవ సూక్ష్మప్రణవ కారణప్రణవ మహాకారణప్రణవ రహస్యార్థబోధా నిరతాయనమః ఓం.

(17) శ్రీహంససూత్ర బోధాసమర్థన ధురంధరాయనమః ఓం

(18) శ్రీమద్ద్వాదశి పంచదశి షోడశ్యాది మహామన్త్రి మన్త్రార్థ మన్త్రరహస్య మన్త్రసారనామక చతుర్విధ పద రహస్యానుభవ బోధాసమర్థదేశికేంద్రాయనమః ఓం

(19) శ్రీమత్సర్వ సంసార దుఃఖనాశనకర సద్గురవేనమః ఓం

(20) బహిరన్తరతీర్థ ప్రసాదరహస్యార్థ సంవేదినేనమః ఓం

(21) శిష్యపాపాటవీ వీతిహోత్రాయనమః ఓం

(22) వేదోపనిషన్మంత్రసార పుష్పరస భృంగాయనమః ఓం

(23) దురాచార దుష్టసంగము ఖండనాశనాయనమః ఓం

(24) సదాచార శిష్టసంగము నిరతాయనమః ఓం

(25) కామాంధకార భాస్కర సన్నిభాయనమః ఓం

(26) స్వశిష్య స్వస్వరూప జ్ఞానప్రదాయినేనమః ఓం

(27) శ్రీమత్పశ్చిమ చక్రసింహాసనారూఢాయనమః ఓం

శ్లో॥ ధ్యానమూలం గురోర్మూర్తి। పూజామూలం గురోర్పదం
మంత్రమూలం గురోర్వాక్యం। మోక్షమూలం గురోర్కృప॥

తా॥ ధ్యానమునకు మూలము గురువుయొక్క మూర్తిత్వము, పూజకు మూలము గురువుయొక్క చరణము। మంత్రమునకు మూలము గురువుయొక్క వాక్యము. మోక్షమునకు మూలము గురువుయొక్క అనుగ్రహము॥—

శ్లో॥ దేహోదేవాలయ ప్రోక్తో। జీవో దేవస్సనాతనః।
త్యజేదజ్ఞాన నిర్మాల్యం। సోహంభావేనపూజయేత్॥—



ఓం. తత్. సత్.





బ్రహ్మాద్వైత దేశికేంద్ర

అంగలకుదిటి షణ్ముఖస్థపతి.



## శ్రీ గురవే నమః

# శ్రీ అద్వైతానుభవము

---

## ౧ గురునమస్కారము.

శ్లో॥ శ్రీనమో గురుదేవాయ। అద్వైతానుభవం మ
యా। షణ్ముఖాఖ్యస్థపతినా। రచ్యతే బ్రహ్మసిద్ధయే॥

తా॥ గురుదేవునికొఱకు నమస్కరించి షణ్ముఖ స్థపతియను నాచేత బంగారము పుటము వేశిన మేలిమి సిద్ధించినట్లు వరిపిడి రాయిమీద బంగారము వరచిన మంచి చెడుగులు తెలిసినట్లు బ్రహ్మము సిద్ధించునని ఈ అద్వైతానుభవము రచియింపబడినది.

## ౨ వేదబుక్ పారాయణము.

(1) ఓం నమో బ్రహ్మాదిభ్యో। బ్రహ్మ విద్యాసంప్రదాయ కర్తృభ్యో। వంశఋషిభ్యః పరమగురుభ్యః। సర్వోపప్లవరహితః। ప్రజ్ఞానఘనః। ప్రత్యగర్థో। బ్రహ్మై వాహమస్మి। బ్రహ్మైవాహమస్మి। ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః॥

అర్థము:- ఓం బ్రహ్మాదిభ్యో = ప్రణవ బ్రహ్మాది పంచ మూర్తుల॥ బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యో = బ్రహ్మ విద్యా పరంపరులగు కర్తల॥ వంశఋషిభ్యః = గోత్రఋషుల॥ పరమగురుభ్యః = కారణాచార్యులకొఱకు, నమః = నమస్కరించి॥

సర్వోప ప్లవరహితః = సమస్తోపద్రవములు లేనటువంటి, ప్రజ్ఞాన ఘనః = గొప్ప ప్రజ్ఞానము గలిగినటువంటి, అర్థః = ప్రయోజన మైనటువంటి, ప్రత్యక్=ప్రత్యగాత్మ, బ్రహ్మైవ = బ్రహ్మామే, అహం = నేను, అస్మి=అయితిని, ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః= తాపత్రియములు శాంతియగుగాక.

(2) భద్రం కర్ణేభిశ్శృణు యామదేవాః । భద్రం పశ్యే మాక్షభిర్యజత్రాః।స్థిరైరంగై స్తుష్టువాగ్ం సస్తనూభిః।వ్యశేమ దేవహితం యదాయుః॥

అర్థము:- దేవాః = దేవతలారా, కర్ణేభిః = చెవులచేత, భద్రం=శుభకరమైన మాటను, శ్రుణుయామ=వినుచున్నాము, యజత్రాః = యజ్ఞమునందు పూజించదగిన దేవతలారా, అక్షభిః=కన్నులచేత, భద్రం=మంగళమును, పశ్యేమ = చూచు చున్నాము,స్థిరైః = దట్టమైన, అంగైః = అవయవములచేత, తనూభిః = దేహములతో, తుష్టువాంసః = స్తోత్రముచేయుచు, యత్ ఆయుః=ఏఆయుస్సు, దేవహితం=బ్రహ్మదేవునిచేత నిశ్చ యింపబడియున్నదో,ఆఆయుస్సును, విశేమ=పొందుచున్నాము

(3) పరిత్వా గిర్వణోగిర । ఇమాభవంతు విశ్వతః । వృద్ధాయుమను వృద్ధయో । జుష్టాభవంతు జుష్టయః॥

తా॥ స్తుతివాక్యములచే సేవించతగిన ఓ చతుర్వాగీశ్వర నిన్ను ఈనాసంబంధమైన స్తుతివాక్యములు అంతటను ఆవరించు గాక. దీర్ఘాయుర్దాయముగల నన్ను అనుసరించి వృద్ధిగలవి అగుగాక. నాయొక్క-సేవలు నీకు ప్రియములైనవి అగుగాక.

(4) హంస హంసః పరమహంసః।సోహం హంస స్సోహం హంసః । హంస హంసేతియో౽బ్రూయా ద్ధంసోనామ సదాశివః ॥ ఏకహంసో దశవాయవః।ప్రాణాయోగాః ప్రకీర్తితాః హంస హంసేతి మంత్రేణ ద్వాదశాష్టాంగుళం భవేత్।హంసో హం హంస శివస్సోహం శివోహం హంసః । శివోహం హంసః॥

అర్థము:- సః = ఆ, హంసః = హంసయే, అహం = నేను, సః = ఆ, పరమహంసః = పరమహంసయే, అహం = నేను, సః = ఆ, హంసః = హంస, అహం = నేను, యః = ఎవడు, హంసః = హంస, హంసహంసేతి=హంసహంసయని, బ్రూయాత్ =పలుకునో, సః=అతడు, హంసోనామ=హంసయనే ప్రసిద్ధిగలిగిన, సదాశివః = సదాశివుడు, సః = ఆ, ఏకహంసః = ఒక్కహంసే, దశవాయవః = పదివాయువులుగలది, ప్రాణాయోగాః = ప్రాణాయోగములుగా, ప్రకీర్తితాః=చెప్పబడుచున్నవి. హంసహంసేతి = హంస హంసయనే, మంత్రేణ = మంత్రముచేత, ద్వాదశ = పన్నెండు, అష్ట = యెనిమిది, అంగుళం = అంగుళములు, భవేత్ = అగును, హంసః = హంస, అహం = నేను. సః = ఆ, హంసః = హంసయనే, శివః=శివుడు, అహం = నేను. శివః = శివుడైన, అహం = నేను, హంసః = హంస, హంసః = హంసయగు, శివః=శివుడు, అహం = నేను, ఇతి = ఇట్లని, బ్రూయాత్ = పలుకవలెను।

(5) ఓం చరణం పవిత్రం వితతం పురాణం । యేన పూతస్తరతి । దుష్కృతానితేన పవిత్రేణ శుద్ధేన । పూతాతి పాప్మా నమరాతింతరేమ । లోకస్య ద్వారమర్చిత మత్పవిత్రం।

జ్యోతిష్మద్భ్రాజమానం మహస్వత్ । అమృతస్యధారా బహుధా । దోహమానం । చరణం నోలోకేసుధితాం దదాతు॥

అర్థము:- యేన = దేనిచేత, (మనుష్యుడు) పూతః = పవిత్రుడై, దుష్కృతాని = పాపములను, తరతి = తరించుచున్నాడో, తత్ = ఆ, చరణం = తురీయపాదము, (శ్రీ గురు పాదము) పవిత్రం = పవిత్రమైనది, వితతం = విస్తృతమైనది, పురాణం = సనాతనమైనది, తేన = ఆ, పవిత్రేణ = పవిత్రమగు, శుద్ధేన = పరిశుద్ధమగు, చరణేన = తురీయపాదముతో (శ్రీగురు పాదముతో) పూతా = పవిత్రులమై, అరాతిం = శత్రువగు, అతిపాప్మానం = ఘోరపాపమును, తరేమ = తరింతుము, లోకస్య = పరలోకమునకు, ద్వారం = ద్వారమైనట్టియు, అర్చిమత్ = కాంతివంతమగు, పవిత్రం = పవిత్రమగు, జ్యోతిష్మతం = కాంతి వంతమగు, భ్రాజమానం = ప్రకాశించునట్టి, మహస్వత్ = కాంతివంతమగు, బహుధా = అనేకవిధములుగా, దోహమానం = పితుకబడిన, అమృతస్య = నశించని బ్రహ్మపదార్థముయొక్క, ధారా = ధారవంటి, చరణం = తురీయపాదము (శ్రీగురు పాదము), లోకే = లోకమున, నః = మాకు, సుధితాం = బుద్ధిని, దదాతు = ఇచ్చునుగాక.

(6) ఓం సహనావవతు । సహనౌభునక్తు । సహవీర్యం కరవావహై । తేజస్వినావధీతమస్తు । మావిద్విషావహై ఓం శాన్తిః శ్శాన్తిః శ్శాన్తిః ॥

అర్థము:- సః = ఆభగవంతుడు, సహనౌ = ఆచార్యశిష్యులగు మాయిద్దరినికూడా, అవతు = రక్షించుగాక, సహనౌ =

మనమిద్దరముకూడా, భునక్తు = సుఖ మనుభవింతుముగాక, సహావీర్యం=తేజస్సునుకూడా, కరవావహై=చేయుదుముగాక, తేజస్వినౌ=తేజస్సుగలవారమై, అధీతం = చదువుకోబడినది ప్రసిద్ధము, అస్తు=అవుగాక, మావిద్విషావహై=అన్యోన్యము కలహింపకుందుము గాక, శాంతిః=ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, ఆదిదైవిక, బాధలు, శాంతినొందుగాక.

# కర్మ (సృష్టి) కాండ

శ్లో॥ దేహకర్మాణి రక్ష్యాణి । బ్రహ్మకర్మైవ మోక్షదం ।
స్వర్గదం వేద కర్మాణి । శిల్పకర్మాది జీవనం॥

## 3 దేహకర్మలు

దేహాంతః కరణ, ప్రాణేంద్రియ, జ్ఞానేంద్రియ, తన్మాత్ర, కర్మేంద్రియము లిరువదైదు, సంకల్ప, వికల్ప, నిశ్చయ, చల నాది కర్మలు జేయును, ఈదేహేంద్రియములు. పదార్థజీర్ణ మూత్ర పురీషోత్సర్జనాది నిత్యకర్మలను, వమన అజీర్ణ అతి మూత్రాది నైమిత్తికకర్మలను, దేహపతనము గలుగువరకు ప్రతి జీవులకు జేయుచుండును॥ ఇంద్రియములు దుష్ప్రవర్త నలు గలవియైన, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు గలిగి సంసార సముద్రములో మునిగిపోవు దురు. సన్మార్గ ప్రవర్తనలుగలిగి శాంతిగలవియైన జ్ఞానమభి వృద్ధి యగును॥ మఱియు, ఇంద్రియములవలన గలుగు సుకృత, దుష్కృతములైన ఆగామికర్మలును, ఆగామికర్మలవలన నేర్పడు సంచిత కర్మయును, సంచితరాశిలోనుంచి అనుభవించు ప్రారబ్ధ

కర్మలును, ఆత్మజ్ఞాని నశింపజేసుకొనగలుగును. అదెట్లనగా,
శ్లో॥ ప్రారబ్ధం భోగతోనశ్యేత్ । తత్వజ్ఞానేన సంచితం ।
ఆగామిద్వివిధంప్రోక్తం । తద్వేషిప్రియవాదినోః ॥

ప్రారబ్ధము స్వయముగా అనుభవనిచ్చుటచేతను, సంచితము, తత్వజ్ఞానముచేతను, ఆగామి, స్తోత్రముచేయు ప్రియులకు సుకృతము, దూషించు శత్రువులకు దుష్కృతము, సంక్రమించి నశించును. దంతధావన, స్నాన, పాన ఆహార, నిద్రాది నిత్యకర్మలు, తైలమర్ధన, క్షౌరాభ్యంగనాది నైమిత్తిక కర్మలు, నిత్యమాచరించిన యెడల, దేహమారోగ్యముగలదై, దేహిప్రకాశించును.

## ౪ బ్రహ్మకర్మలు

బ్రహ్మకర్మలుః— బ్రహ్మసంబంధమైన హంస సంచారముగల, ఆధార, స్వాధిష్ట, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞేయ, సహస్రారకమలముల వరకు అజపార్పణ కర్మలు - పృధివి, జల, అగ్ని, వాయువు, ఆకాశ, అహంకార, మహత్, అవ్యక్తాష్టదళము లందలిగమన కర్మలు-హృత్పుండరీకమునందు రామయని, ఘంటికయందు, హంసయని, ఓంకార గుహాయందు నేను అనెడి త్రివిధకర్మలు-జ్ఞానామృతక్షీర, అజ్ఞానమలినోదక విభజనకర్మలు - బాహ్యాంతర ఇడాపింగళ సుషుమ్న సంచార షట్కర్మలు - విరూపజ్ఞానమును విజ్ఞానామృత సరోవరమునందు సంచారకర్మయు - సమాధి, యోగ, ముద్రలయందు ఊర్ధ్వలక్ష్యముగల, వీక్షణకర్మయు - బ్రహ్మదండి మొదలగు

సకలనాడులయందు వ్యవహరించు కర్మలన్నియును-౧ సమాధి శిల్ప కర్మలు, ౨ నిష్కామ కర్మలు 3 స్వాభావిక కర్మలు ౪ మోక్షకర్మలు ౫ విహితకర్మలు ౬ బ్రహ్మ కర్మలు ౭ హంస కర్మలు ౮ నిత్యకర్మలు అనబడును.-

ఇవిబ్రహ్మ సంబంధ కర్మలుగనుకనే, కర్మబ్రహ్మ స్వరూపిణీ యని సిద్ధాంతమైనది. బ్రహ్మకర్మ సమారభేయని, బ్రహ్మసూత్రానుష్ఠానముచేసి, బ్రహ్మ సూత్రమనెడి అజప గాయత్రి సూత్రము త్యజించిన యెడల బ్రహ్మమైయుండును.

ఇనుముచే, యినుము ఛేధించినట్లు, వజ్రముచే, వజ్రము కోసినట్లు. శరీరమునకు మూలాంగమైన బ్రహ్మ కపాలాంతర మండలి, ఆత్మనా ఆత్మాన ముద్ధరేత్తనురీతిగా. ఆత్మచేతనే ఆత్మనుద్ధరించుకొనిన యెడల, స్వకులకర్మల నాచరించు బ్రహ్మవిదుడు, ఆహార పానీయాదులను ఇతరులచే రూచించి జీవించెడి బ్రహ్మ విద్వరుడు. అన్యుల ప్రేరేపణచే ఆహార పానీయములు మాత్రమే బొందెడి బ్రహ్మ విద్వరీయుడు. ఆహార, పానీయ, మల, మూత్రాదులులేక, తదేకనిష్ఠగల బ్రహ్మ విద్వరిష్ఠుడు, మోక్షము సమానత్వముగా బొందుదురు. బాహ్య సంధ్యావందనాగ్నిహోత్ర, తామ్రశిలాదారు మృణ్మయములైన, విగ్రహ, బింబ, లింగ, బిందు, ప్రణవ, అఖండ దీప, కృష్ణపాదుకార్చన, యజ్ఞాదికర్మలచే, ఆత్మోద్ధరణ కానేరదు. ఈబ్రహ్మ కర్మలు అనుభవప్రమాణమైనవి.

---

# ౨ వేద కర్మలు

యజ్ఞాది కర్మలు:- స్వర్గకామో యజేతయను శ్రుతి ప్రమాణ రీతిగ, ఈజ్యోతిష్టోమాది కామ్య యజ్ఞములు జేసిన యెడల స్వర్గములో దేవతా శరీరములనే రంభాద్యప్సరస శృంగారాది సుఖభోగములు గలుగునని ఋగ్యజుర్వేదాది సమస్త శాస్త్రములు గలవు.- అన్ని యజ్ఞములకు స్వర్గఫలమొక్కటే యైన యెడల, శతక్రతువులు జేయుట నిరర్థకమే యగును. వేదములందు యజ్ఞములలో పశ్వాది జీవహింస చేయుమనియు, అందువల్ల ద్రోహులగుదురనియు, తద్దోష పరిహారమునకై హిరణ్మ్యపిశలుంచి పూజించమని యున్నందున, జుట్టుపట్టుకొని దవడ పగలగొట్టి, కాళ్లుబట్టుకొని క్షమించమన్నటులే యున్నది.-

ప్రాయశ్చిత్త కర్మలు:- నిషిద్ధములైన మాంసాహార, సురాపాన, బ్రహ్మహత్య, జీవహత్య, భ్రూణహత్యాదులాచరించినందున పాపపరిహారము కొరకు, చాంద్రాయణం చేయుట నాలుక కాల్చుట, పంచగవ్య, పంచామృతప్రాశనాదులచే పవిత్రులుగారు. శిక్షలు విధించుటయగును. రాజకీయధర్మముల వంటివే వైదిక ధర్మము లేర్పడినవి. నిత్యనైమిత్తిక కర్మలు:- ఫలరహితమైన విశ్వజిద్యాగమునకువలె సంధ్యావందనాగ్నిహోత్రాదులుగల నిత్యనైమిత్తిక వేదకర్మలందు ఫలానుభవము లేమియు లేనందున స్వర్గాది ఫలములేగలుగును మహోపాత్త దురితక్షయమనునది శ్రుతికానందున ఫలరహితకర్మలకు స్వర్గమే ఫలమగును. ఇట్టినిత్య నైమిత్తికకర్మ లాచరించనియెడల ప్రత్య

వాయము, (పాపము) గలుగదు. ఈకర్మలు బ్రహ్మజ్ఞానమునకు ప్రయోజనములేనివి, ప్రవృత్తిమార్గములైనవి. దూదేకులసిద్ధప్ప యోగి, మాలనందనారు, లంబాడీ దొంతులమ్మయోగిని, కాపు రంగావధూత, రెడ్డివేమనయోగి మొదలయిన మహాత్ములు యజ్ఞాది వైదికకర్మ లాచరింపకనే కేవలబ్రహ్మ విచారణచే బ్రహ్మణ్యులైరి. ఇదే నివృత్తిమార్గము. గృహస్థాశ్రమపరులైన బ్రహ్మవిదులు, బ్రహ్మార్పణముగా విహితములైన గ్రామములు, తోటలు, విద్యాలయములు, నూతులు, చెరువులు మొదలైనవి నిర్మించినను, లోకోపకార సస్యాభివృద్ధికరమగు వర్షాగమనాదులకొరకు జీవహింసలేని బృహస్పత్యాది యజ్ఞములు చేసినను వాటిఫల మనుభవించరు. అదియెట్లనగా, కట్టెలను అగ్ని దహించినటులనే జ్ఞానాగ్నియు కట్టెలవంటి అజ్ఞానయుక్త వాచస్పత్యాది యజ్ఞకర్మల పుణ్యఫలములను యావత్తు నిశ్శేషముగ దహింపజేయును గనుక బ్రహ్మవిదులకు ప్రత్యవాయము (దోషము) సంభవించదు. వేదాగమములు శబ్దప్రమాణములైనవి. పూర్వపక్షములగునవియగును. అజ్ఞానకర్మలాచరించదగినవి.

## ౬ శిల్పకర్మాదులు.

శీల ఉపధారణేయను శీల్ ధాతువునుబట్టి (శీల్యతేఅభ్యస్యతే ఇతిశిల్పం) అభ్యాసము చేయబడునది శిల్పమనబడుచున్నది. శీలసమాధౌ అను ధాతువునుండి శిల్పశబ్ద ముత్పన్నమైనది. శిల్పమనగా జీవుడు పూర్వముఖుడై సమాధినిష్ఠయందు పరబ్రహ్మమునుగూర్చి యోగలక్ష్యభావములు నభ్యాసము చేయుటే సమాధిశిల్పమనబడును. ఇదే పరమోత్తమ శిల్పము.

జగచ్ఛిల్పము:- మనో, రూప హస్త త్రివిధములుగలది. మనోశిల్పము, విశ్వకర్మా మనసాయద్విహాయాధాతావిధాతా పరమోతసందృగితి, యజుర్వేదోక్త విరాడ్విశ్వకర్మ మనస్సంకల్పమాత్రముచే విశ్వమంతయు చిత్రవిచిత్రములైన అనేక రూపములుగా సృజియించుట ఇదియే భగవచ్ఛిల్పము.

రూపశిల్పము:- త్వష్టారూపాణివికరోతిరితి యజుర్వేదోక్త త్వష్టబ్రహ్మ త్వక్ సృజతీతిత్వష్టాయను నామధారియై, సకలతనువులను గర్భములో నవనవ రూపములుగా సృజియించుట, ఇదే దైవిక శిల్పము.

హస్తశిల్పము:- రూపసౌందర్య కళాకౌశలజాలమును, మనస్సుచే భావించి అయోదారు తామ్రశిలాసువర్ణములతో, చిత్రవిచిత్ర నవీనశిల్పములను హస్తములచే నిర్మించుట, ఇట్టి హస్తశిల్పము దేవమానుషశిల్పములని ద్వివిధములుగలది.

దేవశిల్పములనగా, దేవాలయ, విగ్రహ, గోపుర, రథ, శిఖర, ధ్వజ, వాహన, ధూప, దీప, ఘంటాది పూజానుప్యకరణములు, సృక్స్రువాజ్య ప్రోక్షణ, పూర్ణ, చరు, కపాల, చమస పాత్రాది యజ్ఞోపకరణములు.

మానుష శిల్పములనగా, పచన, పాన భోజన, పాత్రాది గృహోపకరణములు. రాజ్య సింహాసనాయుధముద్రిక మాంగల్యాభరణాదులు, ముద్రణాలయ, హలాది కర్షక కార్మికోపయోగవస్తువులు.

ఈ శిల్పములు భుక్తిముక్తి నిచ్చునవి. దేశోద్ధరణకు మూలకందమైనవి. యేయేదేశములందు శిల్పజ్యోతి వికసించునో ఆయాదేశములు ప్రకాశించగలవు. కర్షక కార్మికాది కర్మల కును, ఆయోదార్వాది శిల్పకర్మలకును సంబంధముగలదు. శిల్పములేకున్న వ్యవసాయాది వృత్తులే జరుగవు. పాడిపంటలు వృద్ధికాజాలవు. ఇవి వృద్ధియైన సర్వజీవులు సుఖించుదురు. అజపగాయత్రి కర్మలు, దేహకర్మలు, శిల్పకర్మలు, కర్షక కార్మికాదికర్మలు, సమస్తదేశములవా రాచరింతురు, ఇవి ప్రత్యక్ష ప్రమాణములైనవి. ఆదిలో ఈశిల్పములు మనువు యాది పంచబ్రహ్మలు సృష్టించుచు దేవశిల్పా చార్యులైరి. అగ్రశిల్పో ద్ధారకులైరి. ఉపాధి యున్నంతవరకు శిల్పాదికర్మ లాచరించుట ప్రధానము.

కర్మకాండ సమాప్తము.

---

# ఉపాసనా (దేవతా) కాండ.

## —♦ 2 గురుస్మరణ ♦—

శ్లో॥ ఓంకారస్యతు మూలకారణమిమం మూకాక్షరం బిందుకం॥ బ్రహ్మాణం పరమాత్మరూపనిరతం శిష్యాళి మోక్షప్రదం॥ సత్యజ్ఞాన మనంతతత్వరుచిరం వేదాంత పీఠాధిపం॥ బ్రహ్మశ్రీగురు సుబ్బయార్య చరణం జీవాత్మకోఽహంభజే॥

## ౮ ఈశ్వరాద్యుపాసనలు.

పాంచభౌతిక దేహధారులైన ఈశ్వర దక్షిణామూర్తి గీష్పతి, గాయత్రి, సరస్వతి, కాళి, లక్ష్మి, దత్తాత్రేయాది అగ్రిదేవతోపాసనలు, ఉచ్ఛిష్టగణపతి, అంకమ్మ, పోలేరమ్మ, సాల్వ, కాలభైరవ, వరాహ, నృశింహాది క్షుద్రదేవతోపాసనలు, అంగన్యాస, కరన్యాసములతో జేయుటవలన నిగ్రహ, అనుగ్రహ, ఘుటికా, పాదుకా, దూరశ్రవణ, దూరదృష్టి, ఆకాశగమన, అభయ, వరదాది సర్వార్థసిద్ధులును, అణిమా, గరిమా, లఘిమాద్యష్టసిద్ధులును, పశు, పుత్ర, ధనధాన్యాది సంపత్తులును, మనోవాంఛలు సమస్తవిద్యలును లభించుననియు, దేవతలు, ప్రత్యక్షమై వరములొసగుదురనియు, మంత్రశాస్త్రములందు జెప్పబడినవి. అనుమాన ప్రమాణములైనవి. మఱి చతుష్షష్టిమంత్రవిద్యలు మూలికాది తంత్రశక్తులు లభించిన సిద్ధులు, మునులు, ఋషులు, కర్మయోగులనునెడి వీరు అట్టి మహిమలుజేసిన మహాత్ములనెదరు. మంత్రశాస్త్రవేత్తలు చేసిన భూతవైద్యమనెదరు. భిక్షుకులుచేసిన యక్షిణీ, కనికట్టుయనెదరు. సామాన్యులు చేసిన గారడీయనెదరు. మూలికామంత్రవిద్యలు గల వారిలలో కొందరు మారణ, రక్షణలు జేయుదురు

సర్ప, వృశ్చికాది బాధలు. కామిర్లు, బెణుకులు మొదలైన బాధలు, మంత్రోచ్చారణలచే కొన్నినివారణ యవుచున్నందు వలన ఈప్రకృతివిద్యలు జ్ఞానవిద్యకుపయోగపడవు. చెవిటివానికి శంఖునాదము వినబడనటులేయగును. కంచుమ్రోగినట్లు కనకంబు మ్రోగునా యన్నటులేయగును. పాలనుతరచి వెన్నతీసి

నటుల, నువ్వులుగానుగాడి తైలముతీసినటుల, గోస్తనములు పిండి క్షీరములు తీసినటుల, దేహములు తరచిన బ్రహ్మసిద్ధి లభించునుగాని, జలమును తగచిన వెన్న రానటుల, యిసుకను గానుగాడిన తైలమురానటుల గోడ్రాలుస్తనములు పిశికిన పాలురానటుల, ఈసగుణ, విగ్రహ, యంత్ర, పూజాదికర్మోపాసనలచే పరబ్రహ్మ మెప్పుడును లభ్యపడదు. మూలికాధారణలు దేవతోపాసనలు గలవారికి లోకపూజ్యతయే గలదు. యెన్ని తీర్థయాత్రలు సేవించినను నిష్ప్రయోజనము. శరీరధారలగు గురుస్వాములు ఆత్మానాత్మ బోధలచే, పరబ్రహ్మమును గోచరింపజేయుటవలన ప్రత్యక్షగురుమూర్తి, నారాధించుటే ధర్మము.

జాబాలదర్శనోపనిషత్, శివమాత్మ నిపశ్యన్తి ప్రతిమాసునయోగినః। అజ్ఞానాం భావనార్థాయ ప్రతిమాఃపరికల్పితాః॥

తా॥ యోగులు ఈశ్వరుని ఆత్మయందే చూచెదరు. ప్రతిమలయందు చూడరు. అజ్ఞానులయొక్క భావనకొరకు ప్రతిమలు కల్పింపబడినవి.

ఉపాసనాకాండ సమాప్తము.



# జ్ఞాన (బ్రహ్మ) కాండ

## సద్గురుస్తోత్ర కదంబము.

(1) శుద్ధస్ఫటిక సంకాశం । దశాంగులాంతరస్థితం ।
గాయత్ర్యుపాధి సహిత । పరబ్రహ్మ గురుంభజే ॥-

(2) తేజోబిందు పరంధ్యానం । విశ్వాత్మహృది సంస్థితం ।
బిందు మధ్యేచ జీవాత్మా । సూక్ష్మరూపేణ వర్తతే ॥-

(3) బీజాక్షరం పరంబిందుం । నాదం తస్యోపరిస్థితం ।
సశబ్దంచాక్షరే క్షీణే । నిశ్శబ్దం పరమంపదం ॥-

(4) బిందురూపం మహాదేవం । వ్యోమాకారం సదాశివం ।
ఊర్ధ్వనాళ మధోబిందు । స్తస్యమధ్యే స్థితంపునః ॥-

(5) హృత్పద్మ కర్ణికామధ్యే । స్థిరదీపనిభాకృతిం ।
అంగుష్ఠ మాత్రమచలం । ధ్యాయే దోంకారమీశ్వరం॥-

(6) తదేవ నిష్కళం బ్రహ్మ । నిర్వికల్ప నిరంజనం ।
తద్బ్రహ్మాహ మితిజ్ఞాత్వా । బ్రహ్మసంపద్యతే ధ్రువం ॥-

(7) హ్రస్వం బిందుగతం దైర్ఘ్యం । బ్రహ్మరంధ్రగతంప్లుతం।
తన్మాత్మకాక్షర మాచార్యం। సమాధియోగ లక్ష్యతే ॥-

(8) బ్రహ్మబిందు సదాధ్యానం । ధ్యానబిందు స్వరూపకం ।
తేజోబిందు విరాడ్రూపం । నాదబిందు గురుంభజే ॥-

(9) అమృతం బిందుసంవేద్యం । యత్పరమాక్షరం సదా ।
పరిపూర్ణం పరాత్మానం । స్మరామి హృదిసర్వదా ॥-

(10) సద్యోజాతాది గోప్యాంత । షణ్ముఖాంతర సంస్థితే ।
హిరణ్మయ పరేకోశే । బ్రహ్మనేత్రే గురుంభజే ॥–

(11) యత్ప్రసాదాదయం శిష్యో । జ్ఞానముత్పద్య తస్సుఖీ ।
గురూణాం గురువరేణ్యా । విశ్వరూపం భజామ్యహం ॥–

(12) పాంచభౌతిక దేహస్య । మూలబ్రహ్మ కపాలినం ।
తత్కపాల సమాధిస్థ । మాచార్యమభి వాదయే ॥–

(13) జీవత్వం సర్వభూతానాం । సర్వత్రాఖండ విగ్రహం ।
చిత్తాహంకారయంతారం । జీవాఖ్యంత్వం పదంభజే ॥–

(14) ఓమిత్యేకాక్షరం బ్రహ్మ । విద్యుల్లేఖేవ భాస్వరః ।
దహరాకాశమధ్యస్థో । తస్మై శ్రీ గురవేనమః ॥–

(15) ఏకాక్షర పదారూఢం । సర్వాత్మక మఖండితం ।
సర్వ వర్జితచిన్మాత్రం । స్థిత ప్రజ్ఞ గురుంభజే ॥–

(16) బ్రహ్మవిద్యా పరోక్షత్వం । అంగుష్టాంతర భాసురం ।
బిందురూప పరాత్మానం । గురుదేవ ముపాస్మహే ॥–

(17) యద్బ్రహ్మ పుండరీక స్థం । మహావిద్యా ప్రకాశితం ।
తద్బ్రహ్మరూప మాచార్య । పాదావిత్యాభివాదయే ॥–

(18) ఊర్ధ్వకుండలి చిద్రూపం । యోగసిద్ధి హృదాసనం ।
నిర్విశేషపరం తత్వం । స్వమాత్ర మపిచింతయే ॥–

(19) నిర్వికల్ప సమాధిస్థః । బ్రహ్మమాత్ర ప్రబోధతః ।
యోగినోయత్పదం యాంతి । తత్కైవల్య పదాశ్రయే ॥–

(20) మహావాక్యార్థ సిద్ధాంతం । బ్రహ్మవిద్యా కళేబరం ।
వికలేవరకైవల్యం । గురుమూర్తి పదంభజే ॥–

(21) మన్వాది పంచబ్రహ్మాణో । యత్రవిశ్రాంతి మాప్నుయుః।
తదఖండ సుఖానందం । విశ్వకర్మాణ మాశ్రయే ॥-

(22) హంసారూఢ విధిప్రోక్తా । నాదాలిఖ్యతి విశ్రిమేత్ ।
తదాధారం నిరాధారం । బ్రహ్మమాత్ర మహంభజే ॥-

(23) ప్రాదేశమాత్రి సంచారం । మూర్ధ్నిజ్యోతి ప్రకాశకం ।
అష్టహృత్పద్మ మధ్యస్థ । గురుబ్రహ్మాణ మాశ్రయే ॥-

(24) నవదేహాంతరాళస్థం । ప్రత్యగాత్మ స్వరూపకం ।
అణుమాత్రేణ వర్తిత్వం । తస్మై శ్రీ గురవేనమః ॥-

(25) తుర్యాతీతం పరాత్మానం । అంతర్లక్ష్యేణ దర్శితం ।
శిష్యహృత్పద్మ సంసేవ్యం । తస్మై శ్రీ గురవేనమః ॥-

(26) శిష్యసంరక్షణోద్ధారం । శిష్యహృత్తాపహారకం ।
లక్ష్యార్థ ప్రత్యగాత్మానం । తీర్థస్వామి నమాశ్రియే ॥-

(27) సర్వపాపాన్ పరిచ్ఛేదం తాపత్రయ నివారకం।
బ్రహ్మకేశాన్ పరిమృజ్య । మోక్షప్రద గురుంభజే ॥-

(28) బ్రహ్మఒలయా వివేశాథ । బిందుబ్రహ్మ ప్రవర్తితం ।
దహరాంత ప్రలీనంవై । పూర్ణాచార్య మహంభజే ॥-

(29) జీవాధ్యాస విముచ్యార్థం । తితీర్షుదుఃఖ సాగరం ।
జీవబ్రహ్మైక్య సిద్ధ్యర్థం । గురుదేవం స్మరామ్యహం ॥-

(30) ఘంటికాయుక్త కుహరే । హంసమంత్రం జపేత్సదా ।
సమాధి నిష్టమాచార్యం । దివ్యలక్ష్యాన్వితంభజే ॥-

(31) శ్రుత్యాచార్యో పదేశేన । ఋషయోంతత్పదంయయుః ॥
స్వాత్మానుభూతి సంసిద్ధం । స్వరూపం బ్రహ్మభావయే ॥-

(32) అష్టపత్రింతు హృత్పద్మే । బిందుబ్రహ్మాణ మవ్యయం ।
వీరచక్ర రథారూఢం । దేశికేంద్రం సదాభజే ॥-

(33) పంచాంగుళాంతరాత్మానం । బిందురూపేణ వర్తినం ।
జన్మరాహిత్య సిద్ధ్యర్థం లక్ష్యసంధాన కుర్మహే ॥-

(34) బ్రహ్మనిష్ఠ పరిదత్తాయ । సత్యలోకైక వాసినే ।
బ్రహ్మానంద ప్రబోధాయ । తస్మై శ్రీ గురవే నమః ॥-

(35) యన్మహోప నిషద్వేద్యం । చిదాకాశ తయాస్థితః ।
పరమాద్వైత సామ్రాజ్యం । సద్గురుబ్రహ్మ మేగతిః ॥-

(36) ఉపజిహ్వా సుమార్గేణ । బ్రహ్మనాళాగ్ర వాసినం ।
దేశికం సుబ్బరాయాచార్యం । షణ్ముఖాభ్యర్థ జామ్యహం ॥-

(37) ఋతవో నేత్రసంఖ్యాస్తు । గురుస్తోత్ర కదంబకం ।
భుక్తిముక్తి ప్రదాతారం । పఠేద్బ్రహ్మాణ మాశ్రయేత్ ॥-

## ౧౦ బ్రహ్మ విద్యార్హత.

యోనిలింగభేదములవల్ల స్త్రీపురుషులన్నట్లు స్థూలదేహాకార భేదములచేత మానవ, పశు, పక్షి, మృగ, క్రిమి కీటకాదులనిరి. ఇవి ప్రత్యక్ష పరిమాణములు, మానవులలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, పంచమాదికులములు. తల్లిదండ్రులు, పుత్ర, పుత్రిక, పౌత్రులు, భార్యాభర్తలు, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లు, అత్తమామలు, అల్లుళ్ళు, బావమరుదులు, వదినమరదళ్ళు, పినతల్లి పెత్తల్లులు, పినతండ్రి

పితృంద్రులు, మొదలైన నావివరుసలు లోకవ్యవహారముల కొరకు వేదశాస్త్ర ప్రమాణములైనవి. మహాత్మా సర్వ భూతాత్మాయను రీతిగా అందరియందాత్మయొక్కటేనని అను భవప్రమాణమైనది. యో దేవానాంనామధాః అను యజు ర్వేదోక్త ప్రకారము సమస్తదేవతా నామములు విశ్వకర్మ పరమాత్మకే జెప్పబడినందున యేమతస్తులు, యేవర్ణస్థులు. యేశివకేశవాది నామములు స్మరించినను యొక్కటే.

శ్రుతి॥ తంమను రాఉధత్తతేన మను రాఉథోన్ణలస్మా న్మానవ్యః ప్రజాఉచ్యన్తే అను యజుర్వేదోక్త ప్రకారము. మనోరపత్యం పుమాన్ మానవాః॥ మను బ్రహ్మసంతతియే మానవులైనటుల॥ యుక్తి॥ హ కారం సూర్యుడు. స కారం ఇందువు గనుక హ కారమందు ఇందుశబ్దము చేర్చగా, హిందు వనబడెను. హ కారమైన సూర్యనాడి, స కారమైన చంద్ర నాడి సంచారములచే జీవించుచు ప్రాణాయామ సమాధి, యోగనిష్ఠాభ్యాసములు సూర్యచంద్ర నాడులద్వారా జేయుచు బ్రహ్మకపాలంతరమందు జీవబ్రహ్మైక్యమొందు మానవులందరు హిందువులేయైనందున, బ్రహ్మవిద్యాచరణకు స్త్రీ, పురుష, కుల, మత భేదములు విచారించదగదు.

# ౧౧ బ్రహ్మదరిశనము.

అజ్ఞానమను బురదనీరు, విజ్ఞానమను పటికపొడిచే నడు గంటి, జ్ఞానబ్రహ్మమను జలమే నిర్మలముగ దర్శనమైనట్లు॥ అన్నిటిని ప్రత్యక్షముగా జూచు నేత్రములు, తన ముఖమును

తెలుసుకొనలేక, అద్దమందలి ముఖప్రతిబింబముచేత తనయొక్క కేవల ముఖబింబమును తెలుసుకున్నట్లు, దూరవీక్షణ దుర్భిణి యంత్రములవల్ల సూర్య, చంద్ర, నక్షత్ర, బింబములు, స్వచ్ఛముగా దర్శనమైనట్లు సర్వమును గుర్తెరుగు తెలివి, తన్నుతాను తెలుసుకొనలేక, జీవభ్రాంతిని పొంది, గురువువలన తెలియబడిన, ఈసుషుమ్నా ఘంటికా దర్పణముద్వారా, గాయత్ర్యుపాధిని గుర్తెరిగి బ్రహ్మము తెలియవలయును. యజుర్వేదం,.౨ కాం, 3 ప్ర, 3 అ॥ గాయత్రీ త్రిష్టుబ్జగతీ... జోబలమిన్ద్రియం వీర్యం ప్రజాం + + + విశ్వకర్మన్నితి దేవాః, దాభీత్య సురాః॥ తా॥ గాయత్రీదేవిని విశ్వకర్మన్ అని దేవతలు, ధాభీ (సర్వార్థప్రాపికే) అని పూర్వదేవతలును, బిలచినందున, యజుర్వేదమందు, విశ్వకర్మా వైశ్వకర్మణీ దేవతను పఠత్తే॥ అని యున్నందున, గాయత్రీ విశ్వకర్మలే, వైశ్వకర్మణీ విశ్వకర్మలని సిద్ధాంతము. మంత్రపుష్పములో, నీవారసూకవత్తన్వీ, పీతా భాసత్యణూపమా । తస్యాశ్శిఖాయా మధ్యే । పరమాత్మా వ్యవస్థితః॥ అనగా నివ్వరిధాన్యముయొక్క ముల్లువంటి పచ్చని శరీరముగల అణువుయొక్క శిఖామధ్యయందు పరమాత్మ గలదనియు, బ్రహ్మసూత్రములలో గాయత్ర్యుపాధి సహిత బ్రహ్మమనియు గలదు. అన్నంబ్రహ్మే ద్విజానాత్తను, అన్నమయాది పంచకోశములెట్లు బ్రహ్మమునకు గలవో అటులే, ముండకోపనిషత్తులో హిరణ్మయపరేకోశే అని యున్నందున, బంగారువర్ణముగల పరకోశమే గాయత్ర్యుపాధియైనది. సూర్యునియందు కిరణములు, చంద్రునియందు చంద్రికలు, దీపమునందు ప్రకాశము, అగ్నియందుష్ణము, జలమందు శీత

లము, ఫలములందు మధురము, గంధమందు సువాసన, వాక్యబ్దమందు అర్థము లెట్లుగలవో, అట్లే గాయత్ర్యుపాధి యందు, అవినాభావ సంబంధముగా విశ్వకర్మ పరబ్రహ్మము గలదు. విశ్వబ్రహ్మోప నిషత్తుగో, మనుమయ త్వష్ట శిల్పి విశ్వజ్ఞాః । ఏతే గాయత్ర్యా బద్ధమానాస్సుః ॥ మన్వాదిపంచ బ్రహ్మలు గాయత్రి బద్ధులైనట్లున్న, యజుర్వేదః ॥ గాయత్రం బ్రహ్మవర్చ సందధాతి । గాయత్ర్యా మేవబ్రహ్మ వర్చసే ప్రతితిష్ఠంతి ॥ అనుటచే, బ్రహ్మతేజస్సు గలిగినటువంటి గాయత్రిని ధరియించుచున్నాము. బ్రహ్మతేజస్సుకొరకు గాయత్రి యందు ఉంటుయున్నామని యున్నందున, సగుణబ్రహ్మము నెరుగక, నిర్గుణబ్రహ్మము నెరుగనట్లు, పంచకోశముల నెరుగక పంచకోశవ్యతిరిక్త బ్రహ్మము నెరుగునట్లు, ముందు హిరణ్మయ కోశమనెడి గాయత్ర్యుపాధి దెలసి, బ్రహ్మబిందువును లక్షిం చినయెడల పరబ్రహ్మ దర్శనమైన వారగుదురు.

## ౧౨ అనుబంధ పంచకము.

బ్రహ్మవేత్తలకు ముఖ్యమైనది. ౧ అధికారి, ౨ ప్రయోజనము, 3 సాధనము, ౪ విషయము, ౫ సంబంధము, అనునదే అనుబంధ పంచకము. ఈఅనుబంధ పంచకముగలవారికే బ్రహ్మసిద్ధి లభించును.

౧. అధికారి:- సాధన చతుష్టయ సంపత్తిగలిగి బ్రహ్మ జిజ్ఞాసకు, కుతర్కరహితుడైన తీవ్ర ముముక్షువు.

౨. ప్రయోజనము:- శ్రవణ, మనన, నిధిధ్యాసలచే దృఢమైన జీవన్ముక్తిని విదేహముక్తిని పొందుట.

3. సాధనము:- పరిపూర్ణానుభవము పొందుటకు సమాధి, ముద్ర, యోగ, లక్ష్యములు, బోధలును సాధించుట.

౪. విషయము:- అసంభావన విపరీతభావనలు విడచి వేదాంత శాస్త్రానుభవములు గ్రహించుట.

౫. సంబంధము:- ప్రణవ వేదమను ఉపనిషత్తులు, ఆప్రణవబ్రహ్మమునే ప్రతిపాదించుటవలన అట్టి ప్రణవ విచారణ చేసిన తాను ఆపరబ్రహ్మమునందు అన్యోన్యానుభవము కలిగి మణివలె ప్రకాశించుట.

## ౧3 సాధన చతుష్టయము.

శ్లో॥ పిపీలికాది జంతూనాం । మేధావీ మానవోత్తమః ।
భవేత్సాధనసంపత్తి । ర్బ్రహ్మ విద్యాధికారిణః ॥

తా॥ చీమలు మొదలైన జంతువులలో, మేధాశక్తిగల మానవోత్తముడు, సాధనసంపత్తిగలవాడైన యెడల బ్రహ్మ విద్యాచరణకు అధికారియగును.

సాధన చతుష్టయ సంపత్తియనగా, ౧ నిత్యానిత్య వస్తు వివేకము, ౨ ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము, 3 శమాది షట్కసంపత్తి, ౪ ముముక్షుత్వము అనునవి.

వీనిలో నిత్యానిత్య వస్తువివేకమనగా, బ్రహ్మ (ఆత్మ) నిత్యము. జగత్తు (దేహము) మిథ్యయని గురుముఖముగా నెరుగుట. ఇహాముత్రార్థ ఫలభోగవిరాగములనగా, భూలోక

మందు కర్మజన్యంబులై, అనిత్యంబులైన పుష్ప, చందన, వస్త్రాలంకార, భూషణ, వనితాది విషయ భోగాదులయందును, స్వర్గలోకమందు, కర్మజన్యంబులై, అనిత్యంబులైన, రంభాద్యప్సరస స్త్రీ సంభోగాదులయందును, వమనాన్నమూత్రపురీషాదుల యందువలెనే, యిచ్ఛలేక యుండుట. శమాది షట్క-సంపత్తియనగా, శమము, దమము, ఉపరతి, తితీక్ష, శ్రద్ధ, సమాధానము యని యారువిధంబులు గలవు.

౧. శమంబనగా:- మనస్సును ప్రపంచ విషయముల యందు బోనీయక, వేదాంత శ్రవణములయందే నిలుపుట.

౨. దమంబనగా:- జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములను వేదాంతశ్రవణాది వ్యతిరిక్తంబులైన విషయంబుల వలననుండి త్రిప్పి, వేదాంతవాక్య శ్రవణంబుల యందే నిలుపుట.

3. ఉపరతియనగా:- అవిహితములైన పాపకర్మలను విడచి, విహితములైన పుణ్యకర్మలను, కర్తృత్వాద్యభిమాన రహితుడై, ఫలంబు నపేక్షింపక, లోకోపకారముకొరకు చేసి సను, బ్రహ్మనిష్ఠకు యోగ్యమైన, తురీయ పరకాయమందు రమియించుచు, కారణమను యోని దేహమందు జనియించక, సదా అయోని సంభవుడై యుండవలయునని, బ్రహ్మనిష్ఠకు విఘ్నములైన వేదోక్త కులాచారకర్మలు క్రమముగా వదలుచు, చిత్తమును బ్రహ్మవిచారణయందే నిలుపుట.

౪. తితీక్షయనగా:- ప్రారబ్ధవశమువలన, నేయే వేళల యందు శీతోష్ణ సుఖదుఃఖాదు లేమేమి సంభవించుచున్నవో,

అవి అనుభవించి తీరవలెనని బుద్ధియందు నిశ్చయించుకొని మంచి కలిగినపుడు సంతోషమును, చెడు కలిగినపుడు వ్యసనమును పొందకుండుట.

౫. శ్రద్ధయనగా:- గృహనిర్వాహణ, కులాచారాది పూర్వవిషయముల యందెంత, విశ్వాసము గలిగియుండెనో, అటులనే, గురువేదాంత వాక్యేశ్వరులయందు సంపూర్ణ విశ్వాసము గలిగియుండుట.

౬. సమాధానమనగా:- ఆ త్రిప్పిన మనస్సును, ఇంద్రియములును, శాస్త్రవాసనా, లోకవాసనా, దేహవాసనా, వశేములవల్లనుండి మళ్ళించి, వేదాంత శ్రవణాదులయందే నిలుపుకొని॥ శ్లో॥ శాస్త్రదృష్టం గురోర్వాక్యం। తృతీయం ఆత్మనిశ్చయం। అన్నటుల, వేదాంతశాస్త్ర, గురువాక్యానుభవములచే, మనస్సును సమాధాన పరచుకొనుట.

ముముక్షుత్వమనగా:- మోక్షము కావలెనని కోరుట, అంతమాత్రముచే మోక్షేచ్ఛ కానేరదు. మఱి, మందమోక్షేచ్ఛ। తీవ్రమోక్షేచ్ఛయని రెండువిధములుగలవు. మందమోక్షేచ్ఛయనగా, మోక్షమునకు గావలసిన గుణములను సంపాదించక, శిష్టాచారాది అసూయాగ్రస్తులై, తగినగురువు లెక్కడ లభించలేదనుచు, మోక్షము కావలయునని కోరుటే మందమోక్షేచ్ఛ.

తీవ్రమోక్షేచ్ఛయనగా:- గృహము దగ్ధమగుచుండగా, ఆయగ్నిచేత తప్తుడైన పురుషుడు, కళత్ర, పుత్ర, ధన, ధాన్యా

దులను విడచి, తన ప్రాణము దక్కిన చాలునని, శీతంలబున బ్రవేశించి ప్రాణము రక్షించుకొని శాంతుడైనటుల, బాహ్యాంతర తాపత్రయాగ్నులచే దహించుట, సంకల్పవికల్పములే కోరలుగల, మనస్సనెడి పెద్దపులి కరనవచ్చుట, ఆశయనెడి కృష్ణసర్పము కాటువేయుట, జ్ఞానరత్నమును, కామక్రోధాదుల నెడి, ఆరుగురు దొంగలు నపహరించుట, బ్రహ్మము తానని తెలియక, దేహేంద్రియములు నేనని దారితప్పుట. నిట్టిపంచోపద్రవములన్నియు, నేకకాలమందు సంప్రాప్తించుటవలన, నీపంచోపద్రవములన్నియు, బోగొట్టెడి, సద్గురువు లెక్కడగలరో, యిందుకు సాధనము లేమేమికావలయునో, యని పరితపించుకొనుచుండువాని చిత్తవృత్తికే తీవ్రమోక్షేచ్ఛయని పేరు.

వీటిని నిరాకరించుటకై, పై నాలుగు సాధనంబులుగలవాడే యధికారి శిష్టాచార కర్మోపాసనలు, నభ్యసించుచు వ్యష్టి భావనగల వారికి, బ్రహ్మమెట్లు లభ్యపడదో, అట్లు సాధన చతుష్టయ సంపత్తిలేనివారికి, ఆత్మానాత్మ శ్రవణాదులు చేయించినటులైన, ఆజన్మంబున బ్రహ్మజ్ఞానము లభించదు. అందువలన యాసాధన చతుష్టయము, శ్రవణకాలముల యందైనను, గురుముఖముగా సంపాదించు కొనవలయును.

బ్రహ్మవిద్యాధికారికి నాలుగుసాధనలు యేలచెప్పనెలయును. నిత్యానిత్య వస్తు వివేకమే చాలునని చెప్పవదమన అది చాలదు. ఎందువల్లననగా, శబ్ద, తార్కికాది, శాస్త్రజ్ఞులకు, నిత్యానిత్య వస్తువివేకము కలిగినను, వారు లోకవిషయముల యందాశక్తి గలిగి, కామ్య యజ్ఞాది కర్మంబులే చేయుచున్నారు.

గనుక వారల కధికారము చాలదు. కాబట్టి రెండు సాధనంబు లుండిన, చాలునా యనిన అవిచాలవు. ఎందువల్లననగా, కాషాయవస్త్రములు ధరించి, పాంకోళ్ళు తొడుగుకొని, కుంకుమ రేఖలు దిద్ది, శిరఃకేశములు, గడ్డములు బెంచి, వైరాగ్యుల మనెడి కొందరు, ఋషీశ్వరులకు నిత్యానిత్య వస్తువివేకము, ఇహాముత్రార్థ ఫలభోగ విరాగంబునుం గలదుగాని, వారలకు కోపతాపంబు లధికంబులై, యితరులను శపియించుచు, శమాది షట్కసంపత్తి లేనందున వారల కధికారము కానము. కాబట్టి మూడు సాధనంబులుండిన చాలునాయనిన అవిచాలవు ఎందువల్లననగా, కొందరు సంసారమును విడచి జడలు ధరియించి, కృష్ణాజినంబులం జంకబెట్టుకొని, అక్షి, వాగింద్రియాది కాష్ఠమౌనముగల, మునులము, యోగులము, అనుచు, నోటితో మాట్లాడక, నేత్ర, హస్తేంద్రియములచే సంజ్ఞలుచేయుచు, మిక్కిలి శాంతులై, ప్రతిగ్రహాదులు లేకను, మఱి మాగుర్వాజ్ఞ ఇంతేనని, స్వల్పముగా ప్రతిగ్రహించుచు సంచరించువారు, వేదాంతశ్రవణ ప్రదేశములయందు చేరరుగనుక వారికిని అధికారము చాలదు. కాబట్టి నాలుగు సాధనంబులు గలవారే బ్రహ్మజిజ్ఞాసాధికారులు. యీసాధన చతుష్టయ సంపత్తి, కాయికవాచికేంద్రియ వ్యాపారంబుగాదు. మనోవ్యాపారముగనుక, రాజభోగాలంకార, ఆచారశిష్టాది, లోకవిషయంబులయందు నభిలాషలేనివారు, సులభంబుగా సంపాదించుకొనవచ్చును.

పాఠక్రమాదర్థక్రమోబలీయః, యను తర్కశాస్త్రానుసారముగ, ముందు మోక్షేచ్ఛ గావలయుననెడి భ్రమకలుగనిదె

బ్రహ్మసత్యము, జగత్తు మిథ్యయను పెట్లనగ, జాయతగచ్ఛతీతిజగత్తు. చావు పుటకలుగల (దేహము) నశించునది, బ్రహ్మము. (ఆత్మ) స్థిరమైనదని ముందుగా తోచినగాని, మోక్షము సిద్ధించదు. కాబట్టి పాఠక్రమముగా, నిత్యానిత్య వస్తువివేకాదులు, సంపాదించుకొని అనంతరము బ్రహ్మవిచారణ చేయుటే ప్రథమ ధర్మము గనుక, బ్రహ్మ సూత్రములలో, ముందుగా, అథాతో బ్రహ్మ జిజ్ఞాసాయనిరి.

సీ॥ హరిహరాదులకైన | నలవిగాకుండిన | బరమాత్మ నెవ్వగు | బడయగలరు ॥ జపమాలికలు ద్రిప్పు | జడధారులైనను | బ[illegible]పదంబును | బడయగలర ॥ రాజాధిరాజులు | రాజ్యంబు వదలిన | బరమగుహ్యంబును | బడయులేరు ॥ కావిచేలంబులు | గావించు యతులైన | బరమ గోప్యంబును | బడయగలరె ॥
గీ॥ నాల్గువిధముల సాధన | నడచువాడె | తత్వకోవిదుడై ధ[illegible]నరుచుండు ॥ నట్టివానిని జగతిలో | నార్యుడనుచు | బిల[illegible]గాదె ధీరులు | బిసరుహాక్షి ॥

## ౧౪. వైరాగ్యము.

శుక్ల శోణితములచే నేర్పడినటువంటి, మల, మూత్ర, గుల్మి, పుసి చీమిడి, దొంగ, దుర్గంధము, చెమట, రక్తము, చీము, యెముకలు, నుసిపురుగులు, కఫము, క్రిములు, మాంస, చర్మములు మొదలైన వాటితో నిండింపబడినటువంటి శరీరములు గల మానవులలో, స్త్రీలయొక్క ముఖము, సుందరముగలదైన పసుపు, గంధము, తిలకములు, మొదలగు మెరుగులు బెట్టనేల.

కండ్లు సుందరములుగలవైన, కాటుక, సుర్మాలు దిద్దనేల. నోరు సువాసనగలదైన, జాజి, యాలక, లవంగములు, మొదలైన సువాసనద్రవ్యయుక్త తాంబూలములు వేయనేల. శరీరము మృదువుగలదైన, పెంకులు, యిటికలతోటి, కుంకుడు, సబ్బు, మొదలగువాటితోటి, తోమితోమి కడిగి, చిత్రవిచిత్ర రంగులు పూయనేల. అధరోష్ఠము మెరుపుగలదైన, తాంబూలముచే, మెస్త్రిపొగడరుచే రుద్దనేల. పలుకులు మృదు మధురములుగలవైన సంగీత సాహిత్యములు వినడమేల, పఠియించనేల. దేహములు సుందరములుగలవైన, చిత్ర విచిత్రవస్త్ర, పీతాంబరాఽభరణాలంకారములేల. శరీరము జిడ్డులేక, సువాసన స్వభావముగలదైన, అసహ్యమగు గబ్బుపోవుటకు పునుగు జవ్వాది, పన్నీరు, అత్తరు, చందనములు బూసి, సంపెంగ, మల్లె, గులాబీ మొదలైన సువాసన పుష్పములు ధరియించనేల. కాళ్ళు మెరుపులుగలవైన పసుపు, పారాయణము బూయనేల. దేహము మెరుపుగలదైన చిత్రవిచిత్ర దీపములందు సంచరించనేల. తలవెంట్రుకలు అందముగలవైన ముంగురులుజుట్టి చిత్రవిచిత్ర ముడులు, జడలువేయనేల. ఇట్టి అసహ్య స్త్రీల క్రీగంటి చూపులు, నడకలు మొదలైన యంగవిలాసముల మాంసపుముద్ద స్తనముల, దుర్గంధ మూత్రయోనులందు భ్రమసి, వారల సంభోగస్పర్శాలింగన కోరునట్టి పురుషులందరు, దీపము జూచి పండని భ్రమసిన పురుగులు, దీపములోబడి చచ్చినట్లు, ముష్టిపండు పైకి బాగుగానున్నదని తినినవారు చచ్చినట్లు, తుమ్మెదలు సువాసనగల సంపెంగాది పుష్పరసములగోరి ఆపుష్పములలో జిక్కి చచ్చినట్లు, ఈగలు, చీమలు, మొదలైనవి,

రుచికై, నెయ్యి, ఆముదం మొదలైన జిడ్డుచమురులలో బడి చచ్చినట్లు. జిహ్వాచాపల్యముగలిగి, రజోతామస పదార్థములు భుజియించి, గుహ్యాది ఇంద్రియ చలనములుగలవారై, సుఖ రోగములపాలై, చివరకు చచ్చుటకంటె, సాత్వికాహారములు భుజియించి, ఇంద్రియ నిగ్రహముగలవారై, వైరాగ్యము బొందుటే పరమశ్రేయస్కరము. మఱి, జీవిజీవేన భక్షతి అనే న్యాయముగలదని, కొందరు ఋషులు మానవులకు మరల అపకారముజేయలేని, జీవహింసలజేసి మాంసాహారులైరి. జీవీ జీవేన భక్షతి అనునది, సింహ, శార్దూలాది క్రూరమృగములకు జెప్పబడినదిగాని, ఇహపర జ్ఞానముగల మానవులధర్మముగాదు. సింహములు, పులులు, మొదలైన దుష్టజంతువులు సాధువులైన జీవుల జంపి, పచ్చిమాంసము కోరలతో నమిలి తిన్నటుల మానవులు జేయక, కత్తులు, తుపాకులు, మొదలైన ఆయుధములచే జంపి, లవంగములు, యాలకులు మొదలైన, సువాసన ద్రవ్యములతో వండి, పసనుజేసిన మాంసము భక్షించుట, మానవ ధర్మముగాదు. ఒకజీవిని ఒకజీవి భక్షించుట, అందరికి న్యాయమేమైన యెడల పశువులను, మానవులను, పులులు మొదలైన క్రూరజంతువులు జంపి, తినునని, భయపడి, వాటిని తుపాకి మొదలైన ఆయుధములతో జంపి, వీరల శరీరములు రక్షించుకొననేల. ఆవులు, గేదెలు, మానవులకు పాలనిచ్చును. ఎడ్లు, దున్నలు, వ్యవసాయపుపనులు జేయును. గొర్రెలు, మేకలు, పాలునిచ్చును. వాటిబొచ్చు గొంగళ్లు మొదలైనవాటి కుపయోగపడును. పొలములలో పెంటగట్టును. కోళ్లు ఝాముఝామునకు కూతలువేసి, కాలము తెలియజేయును. అంటువ్యాధులు గలు

గజేయు పురుగుల భక్షించి ఆరోగ్యము కలుగజేయును. కుక్కలు చోరులు రాకుండా మొరుగును. పందులు దొడ్ల యందు పెంటలులేకుండా పరిశుభ్రముచేయును. పిల్లులు ఎలుకల బాధలు నివారణచేయును. నెమళ్ళు, ముంగిసలు, సర్పములను గృహములలోనికి రాకుండునట్లు జేయును. చేపలు కప్పలు, తాబేళ్ళు, మొదలైన జలచరములు నీటిని శుభ్రపరచును. హంసలు, నెమళ్ళు, చిలుకలు, పావురాళ్ళు, లేళ్ళు మొదలైనవి ఆనందము గలిగించెడి నృత్యములు, విలాసచూపులు పలుకులు, జేయును. గుర్రములు, ఏనుగలు, ఒంటెలు, నెక్కి ప్రయాణముచేయుటకు, బరువులుగల వస్తువులు మోయుటకు నుపయోగపడును. యిట్టి సమస్త సాధుజంతువులు మానవుల రక్షణార్థములేర్పడినవిగాని, మానవుల భక్షణకొరకు సృష్టింపబడలేదు. ఇంకా యజ్ఞములందు శక్తి పూజలందు, గో, వృషభ, అజాది జంతువుల హింసజేసి, వాటి మాంసము భక్షించుటచే ఆజంతువులు స్వర్గము బొందునందురు. ఆజంతువులు స్వర్గము బొందేయెడల శక్తిపూజలలో, యజ్ఞములలో, కుంటి, గుడ్డి మొదలైన అంగహీనులుగల నరబలులు చేసినచో వీరికి స్వర్గాది లోకములు గలుగునుగదా, పూర్వపు నరబలులు విడుచుటెందులకు. మానవులను జంపగూడదని ప్రభుశాసన మున్నటుల గో వృషభ అజాదిజంతువుల జంపగూడదని ప్రభుశాసన మున్నయెడల నట్లు చేయరుగదా. గృహము దహనమైన గృహయజమాని దుఃఖించినట్లు, దేహము నశింపజేసిన దేహములో జీవుడు దుఃఖించినందున జీవహింసేయగును. చచ్చిన జంతువుల, చంపిన జంతువుల, మాంసముతిను ఛండాలుడు, బ్రాహ్మణాది

యజ్ఞకర్తలు సమానులే. మఱియు, ఓషధులయందు జీవత్వ ముండుటచే పెరిగి ఫలవంతములైన ఓషధీశాఖ ఫలాదు లనుభవించినందువల్ల జీవహింస గలుగుచున్నదిగదా యనినయెడల చరములైన, నర, పశు, పక్షి, క్రిమి, కీటకాదులు, సుఖ, దుఃఖ, భయ, మైథునాదులు బొందుచుండుల, అచరములైన ఓషధీశాఖ ఫలపత్రాదులు, సుఖ, దుఃఖ, భయ, మైథునాదులు బొందుట లేనందున ప్రాణముగల జీవహింసాదోషము గానేరదు. ఓషధీ, కందమూల, శాఖా, ఫలాహారములే జీవహింసయని విసర్జించినచో క్రిములుగల జలపానముగూడ జీవహింసేయని విసర్జించవలయును. జీవహింసయని ఓషధీ, కందమూల, శాఖాహారము, జలపానము విడచినపుడు, మరణమే సంభవించును. ఓషధీభ్యో అన్నం, అన్నాత్పురుషః । అను ఉపనిషద్రీతిగా, అన్నాహారమువలన పురుషు లుత్పన్నులై బ్రహ్మధ్యాన పరాయణులగుదురు. యదుచ్ఛిష్ట మభోజ్యం । నోచ్ఛిష్ట నాశుచిర్భవేత్తను, ఉపనిషద్రీతిగ, అనారోగ్యము వ్యాధులు గలుగజేయు ఉచ్ఛిష్టాన్నము మాత్రము భుజియించదగదు. పవిత్రాన్నము భుజించవచ్చు. ఋణాలబంధరూపేణ పశుపత్ని సుతాదయః । అన్నటుల ధనధాన్య పశువులు, భార్యాపుత్ర బంధు మిత్రాదులు, ఋణమున్నంతవరకు నొకరికొకరు సహాయులగుదురు. అవి విడచిపోయినపుడు వ్యసనము బొందుటేల. ధనధాన్యాదులు జన్మతో తెచ్చుటలేదు. మరణముతో తీసుకు వెళ్ళుటలేదు పశువులు భార్యాభర్తలు పుత్ర పుత్రిక, బంధు మిత్రాదులు, నేకకాలమందు జన్మించుటలేదు. మరణించుటలేదు. ఒకరికొకరు యెప్పుడు రక్షకులుగారు. తాననే ఆత్మ బ్రహ్మమే రక్షకుడు.

బ్రహ్మవిచారణలో నెంత మేధావంతులైనను సమాధియోగ ముద్రలయందు. నిష్ణాతులై యున్నను, విషయ భ్రాంతులయందు, వైరాగ్యములేనిది నిష్ప్రయోజనమగును. బూడిదలో అజ్యము ంచినట్లే యగుననుటకు సందేహములేదు. వబయో రభేదః అను శాస్త్రప్రకారము వైరాగముగలవారే బైరాగులగుదురు.

## ౧౫ గురుమహాత్మ్యము.

౧. శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణు। రుద్రేశ్వర సదాశివాః।
గురుసాక్షాత్పరబ్రహ్మ। తస్మై శ్రీగురవేనమః॥

తా॥ గురువు శిష్యునియందు వివేకజ్ఞానము సృష్టించుటచే బ్రహ్మమనియు, ఆత్మబోధయనే పాలుబోసి ఆ జ్ఞానము బోధించుటచే విష్ణువనియు, అజ్ఞానము లయింపజేయుటచే రుద్రుడనియు, ఇహలోక భ్రమను తిరోదానమొనర్చి పరమార్ధికభ్రమను కల్పించుటచే మహేశ్వరుడనియు, పరమాత్మయందు క్రీడించు తెలివిగా అనుగ్రహించుటచే సదాశివుడనియు, పంచమూర్తులు, సృష్టి, స్థితి, లయ, తిరోధాన అనుగ్రహము లోకోపకార లోకోపకారపని మాత్రమే చేయుదురుగాన ఆత్మసంబంధమయిన పంచకృత్యము లోకగురువే చేయుచున్నందున కేవల పరబ్రహ్మమైనట్టి గురుమూర్తికొరకు నమస్కారము.

౨. శ్లో॥ అజ్ఞానతిమిరాంధస్య। జ్ఞానాంజన శలాకయా।
చక్షురున్మీలితంయేన। తస్మై శ్రీగురవేనమః॥

తా॥ అజ్ఞానమనే కటికి చీకటికి జ్ఞానమనే అంజన శలాకచే జ్ఞాననేత్రము యేగురువుచే తెరువబడునో, అట్టి గురువు కొరకు నమస్కారము.

౩. శ్లో॥ అఖండ మండలాకారం। వ్యాప్తంయేన చరాచరం।
తత్పదం దర్శితంయేన। తస్మై శ్రీగురవేనమః॥

తా॥ ఖండముగాని మండలాకారమైనట్టి చరాచరములు వ్యాపించినట్టి, అపరిపూర్ణాద్వైత పరబ్రహ్మపద దర్శనము, యేగురువు జూపించునో ఆగురువుకొరకు నమస్కారము.

౪. శ్లో॥ మన్నాథశ్శ్రీ జగన్నాథో। మద్గురుశ్శ్రీ జగద్గురుః।
మమాత్మా సర్వభూతాత్మా। తస్మై శ్రీగురవేనమః॥

తా॥ పంచానాం భూతానాం సమాహారః ప్రపంచః॥ జాయతగచ్ఛతీతి జగత్తు, అనే దేహమునకు నాథుడే, నాకు నాథుడు. అట్టి మద్గురువే జగత్తనే అన్నిదేహములకు గురువు. నాయొక్క ఆత్మే సమస్తభూతములయందున్న ఆత్మ అట్టి జగద్గురువుకొరకు నమస్కారము.

౫. శ్లో॥ చైతన్యం శాశ్వతం శాంతం। వ్యోమాతీతం నిరంజనం।
నాదబిందు కళాతీతం। తస్మై శ్రీగురవేనమః॥

తా॥ చేతనత్వము గలిగినట్టి, శాశ్వతమైనట్టి, శాంతమైనట్టి, ఆకాశమున కతీతమైనట్టి, సూర్యచంద్రాగ్ని విద్యుదాది ప్రకాశములచే రంజింపక స్వయం ప్రకాశమైనట్టి, నాదబిందు కళల కతీతమైనట్టి, గురువుకొరకు నమస్కారము.

౬. శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం। కేవలం జ్ఞానమూర్తిం।
ద్వంద్వాతీతం గగనసదృశం। తత్వమస్యాదిలక్ష్యం।

ఏకం నిత్యం విమలమచలం । సర్వధీసాక్షి భూతం ।
భావాతీతం త్రిగుణరహితం । సద్గురుం తంనమామి॥

తా॥ బ్రహ్మానందమైనట్టి, శ్రేష్ఠసుఖము నిచ్చునట్టి, ముఖ్యమైన జ్ఞానమూర్తిమైనట్టి, మాయావిద్యల రెంటికి, అతీతమైనట్టి, ఆసమంతాత్ కాశతఇత్యాకాశః॥ అంతట ప్రకాశించు ఆకాశముతో సమానమైనట్టి, తత్త్వమస్యాది మహావాక్యములచే లక్షించదగినట్టి, ఒక్కటైనట్టి, నిత్యమైనట్టి, మలినము లేనట్టి, చలనము లేనట్టి, సమస్తబుద్ధులకు సాక్షియైనట్టి, భావముల కతీతమైనట్టి, త్రిగుణ రహితమైనట్టి ఆసద్గురుని గూర్చి నమస్కరించుచున్నాను.

౭. శ్లో॥ యస్యాంతర్నాది మధ్యం । నహికరచరణం । నామగోత్రం నసూత్రం ॥ నోజాతిర్నైవవర్ణనభవతి పురుషో।నాన పుంసోనచస్త్రీ॥ నాకారం నోవికారం । నహిజననమరణం నాస్తి పుణ్యం నపాపం ॥ నోతత్వం తత్వమేకం । సహజ సమరసం । సద్గురుంతంనమామి ॥

తా॥ ఎవనికి మొదలు, మధ్య, చివరలు లేవో, కాళ్లు, చేతులు లేవో, శివకేశవ బ్రహ్మేంద్రాదిత్యాది దేవతానామములు లేవో, సానగ, సనాతన, అహభూన, ప్రత్న సుపర్ణ ఋష్యాది గోత్రములు లేవో, మను, మయ, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞ బ్రహ్మాది గృహ్యసూత్రములు లేవో, విశ్వకర్మ, మను, దైవజ్ఞ బ్రహ్మసూత్రములు లేవో, మానవ, పశు, పక్ష్యాది జాతులు లేవో, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, ఛండాలాది వర్ణములు లేవో, శ్వేత, రక్త, పీత, శ్యామలాది రంగులు

లేవో, స్త్రీ, పురుష, నపుంసకత్వములు లేవో, యే ఆకారములు లేవో, యే వికారములు లేవో, చావు పుటకలు లేవో, పుణ్యపాపములు లేవో, యేతత్వము లేదో, ఏకతత్వమైయున్నదో, అన్ని దేహములయందు, అన్ని వస్తువులయందు సహజముగా సమరసమై యున్నదో, అట్టి అచల పరిపూర్ణ పరబ్రహ్మ సద్గురునిగూర్చి నమస్కరించుచున్నాను.

౮. శ్లో॥ శ్రీగుంటూర్పురవాసి నంచసతతం। శిష్యౌఘసంపూజితం ॥ విశ్వబ్రాహ్మణ శేఖరం సుఖకరం। వేదార్థ సంబోధినం। జాతంనామ్నికులే గురుం మదుపువై। సాధ్వచ్చమాంబాపతిం। పూర్వం సుబ్బయనామ సంఘటిత। మాచార్యం భజేహంసతం ॥

తా॥ లక్ష్మీకరమైన గుంటూరుపట్టణ నివాసియైనట్టి, యెల్లప్పుడు శిష్యసమూహముచే పూజింపబడుచున్నట్టియు, విశ్వబ్రాహ్మణులలో శేఖరుడైనట్టియు, బ్రహ్మానంద సుఖమిచ్చునట్టియు, మదుపువంశమందు జన్మించి గురువైనట్టియు, అచ్చమాంబకు భర్తయైనట్టి, సుబ్బయాచార్య దేశికేంద్రులవారిని గూర్చి యెల్లపుడు, షణ్ముఖశాస్త్రియను నేను, భజియించుచున్నాను.

౯. శ్లో॥ బోధానందఘనం నిరస్తసకలం। కారుణ్యపూర్ణేక్షణం ॥ మూఢానాముపదేశకంచ సతతం। పాపాత్మనాంపాపహం॥ వైరాగ్యంచ విరాగిణాం సుఖకరం। సంపాదకం సర్వదా॥ శ్రీమద్దేశిక సుబ్బయార్య యతినం। మూఢాత్మకోఽహంభజే॥

తా॥ ఘనమైన బ్రహ్మానందబోధలు జేయునట్టియు, ప్రపంచ విషయ భ్రాంతులన్నియు విడచినట్టియు, సంపూర్ణ దయగల చూపులు గలిగినట్టియు, అజ్ఞానమూఢులను యెల్లపుడు జ్ఞానోపదేశము జేయునట్టియు, పాపాత్ములయొక్క పాపములు బోగొట్టి, అష్టదళ వ్యాపారములందు వైరాగ్యము గలుగజేయునట్టియు, విరాగులకు ఆత్మానంద సుఖము గలుగజేయునట్టి, శ్రీమద్దేశికేంద్రులైన, సుబ్బయాచార్య యతీనిగూర్చి, మాహాత్మ్యగలిగిన షణ్ముఖస్థపతియను నేను సేవించుచున్నాను.

## ౧౬ గురుశిష్య లక్షణములు.

(1) తాబేలు యొకచోట గుడ్లుబెట్టి మరియొకచోటున వుండి ఆగుడ్లను తలచునపుడు వాటికి ఆకలిదప్పులులేక, పెరుగుట స్వభావముగాన ఆకూర్మమువలె గురుడు శిష్యునకుపదేశము జేసి, తానెక్కడున్నను శిష్యునకు విషయసుఖములు గలుగజేసెడి ఆగామికర్మలు తొలగి, సద్గుణములు బ్రహ్మజ్ఞానము వర్ధిల్లుగాక యని అంతఃకరణయందు తలచుచుండవలయును.

(2) మత్స్యములు నీళ్ళలో గుడ్లుబెట్టి, అవితిరిగినదెరిగి వాటికై తిరిగిచూచునపుడు అవి పిల్లలయి, వృద్ధిబొందుట ప్రసిద్ధము గనుక, గురువు శిష్యుని ఆచేపలవలె వీక్షించుచు, పూర్వసంచితకర్మ సంబంధమైన, ప్రాకృత దుష్టగుణములు నశించి, బ్రహ్మవిద్యా లక్షణములుగలవానిగా, సంపూర్ణదృష్టిచే జూచుచుండవలయును.

(3) పక్షి గుడ్లుబెట్టి వానిని దనరెక్కలచేత పొదగగా అవి పిల్లలయి వృద్ధినొందుట సహజముగాన, గురువు పక్షివలె

తన అభయహస్తమును, శిష్యుని మస్తకమందుజేర్చి పారబ్ధాను భవము బొందుటను స్పృశించవలయును.

(4) కుమ్మరపురుగును, తుమ్మెద యొక గూటిలోబెట్టి, ముల్లుచేపొడిచి, చుట్టూ తిరుగుచు నాదముచేయుటచే నిశ్చలముగా ఆనందించుచున్న కుమ్మరపురుగు, తుమ్మెదఅయి విహరించినట్లు, జననమరణ ప్రవాహములోబడి, ఆధ్యాత్మిక ఆదిభౌతిక, అధిదైవిక, తాపత్రయబాధలు బొందుచున్న శిష్యుని హృత్పుండరీకములోజేర్చి, దహరావకాశగమనము చేయుచు, వేదాంతశాస్త్ర ప్రబోధగానము గురువు చేయుచుండగా, శిష్యుడు బ్రహ్మానందానుభవ రసము గ్రోలుచున్నవాడై, సత్యజ్ఞానానంద స్వరూపుడైన గురుస్వరూపము బొంది ప్రచారము జేయుచుండును.

(5) మార్జాల మొకచోటున పిల్లలుబెట్టి పాలిచ్చి ఒక్కొక్కయింటిలో మూడేసిరోజుల చొప్పున యేడుగృహములు త్రిప్పుచు యిరువదొక్కరోజు కాగానే ఆపిల్లికూనలకు శక్తివచ్చినదని గుర్తించి వాటిని విడిచిబెట్టినట్లు, గురువు శిష్యుల కుపదేశముజేసి, ఆధారాది సహస్రాంత సప్తగృహముల రహస్యములను బోధించుచు యేడవదైన సహస్రార గృహమందుజేర్చగా శిష్యుడు సంపూర్ణజ్ఞాననేత్రము తెరచినందున గురువు స్వేచ్ఛగా విహరించును.

(6) మర్కటము పిల్లనుగని దానివెంట జూడకున్నను పిల్ల తల్లిని గట్టిగా కావిలించుకొనగానే, తల్లియైన కోతి చెట్టు కొమ్మలమీద గంతులు వేయుచుండుటచే ఆవిద్య పిల్లగ్రహించి

నట్లు; గురువు శిష్యున కుపదేశముజేసి, తాను సంచారము చేయుచుండుటచే, శిష్యుడు గురువును వదలక, వెంటదిరుగుచు, బ్రహ్మజ్ఞానబోధలు వినుచు, పట్టినపట్టు విడువక యుండిన బ్రహ్మజ్ఞుడగును.

(7) మేఘములెక్కువగా వచ్చియున్నపుడు, పురుష నెమలి ఫించమువిప్పి ఆడుచుండుటచే, దాని కంటియందువచ్చిన ఆనందబాష్పములను స్త్రీనెమలి మ్రింగి గర్భము ధరించినట్లు, గురువులవారు జేయు బ్రహ్మానంద బోధామృతమును శిష్యుడు గ్రోలుచు, జీవభ్రాంతులువిడచి తురీయమనెడి పరకాయమందు ప్రవేశించి బ్రహ్మము గావలయును.

(8) హంస పాలను గ్రహించి నీరును విడచినటుల, ప్రాపంచిక సంబంధమైన అజ్ఞానమును శిష్యుడు విడచి, గురుస్వాములవారు బోధించు బ్రహ్మజ్ఞానమునే గ్రహించుచుండవలెను.

(9) వరాహము భూమిని కుళ్ళగించుచు అందలిరుచిని ఆపంది గ్రహించినటుల, శిష్యుడు ఆచార్యులవారు బోధించు జ్ఞానబోధలు వినుచు, కుతర్కరహితుడై విమర్శనజేయుచున్న యెడల బ్రహ్మానందానుభవము పొందగలడు.

(10) చిలుక కీయను శబ్దమును గ్రహించి పరమసంతోషానందము బొందినటుల శిష్యుడు లోకవిషయధ్వనులు విడచి దేశికేంద్రులవారు ఉపదేశించిన నాదబ్రహ్మమును లక్షించి నిర్మల బ్రహ్మానందుడై యుండవలయును.

# ౧౭ భక్తిత్రయము.

బాహ్యభక్తి, అనన్యభక్తి, ఏకాంతభక్తి, అని మూడు విధములు. బాహ్యభక్తియనగా శ్రవణం, కీర్తనం, తీర్థస్మరణం పాదసేవనం । అర్చనం, వందనం, దాస్య, మాత్మసఖ్యాని వేదనం॥

(1) శ్రవణముఅనగా శ్రీగురుబ్రహ్మ విషయచరిత్రలు ప్రేమతో వినుట.

(2) కీర్తనము అనగా:- ఆగురుభగవంతుని దివ్య చరిత్రలను మిక్కిలి ప్రేమతో బాడుట.

(3) స్మరణము అనగా:- ఆతీర్థస్వామియొక్క సహస్ర నామములు అంతరభక్తిచే స్మరియించుట.

(4) పాదసేవనము అనగా:- ఆ గురుదేవునియొక్క దివ్యచరణారవిందములను నిర్మలహృదయముతో పరిచర్య చేయుట.

(5) అర్చనము అనగా :- ఆ పరతీర్థమూర్తిని అమల మనస్సుచే బూజించుట.

(6) వందనము అనగా:-ఆగురువరేణ్యులవారి పాదపద్మములకు అవ్యక్తాద్యష్టాంగ నమస్కారములు జేయుట.

(7) దాస్యముఅనగా;- దేశికేంద్రులవారికి భృత్యుడై యుండుట.

(8) ఆత్మనివేదనము అనగా:- ఆచార్యునియందు తన హృద్గతజీవాత్మను సమర్పించుట.

(9) సఖ్యము అనగా:- ఆపరదేశికునియొక్క జపపరాయణుడై యితరధ్యాస లేకుండుట.

అనన్యభక్తి యెట్లనగా:- బృహతీతి బ్రహ్మయనురీతిగ, ప్రపంచమంతట వృద్ధిబొందిన బ్రహ్మయనియు, ఆపరబ్రహ్మము సర్వదేహమయుండనియు, గురుబ్రహ్మములేని ప్రపంచ మంత మాత్రము లేదనియును, దలచి, నిశ్చలాత్మకుండై పరబ్రహ్మమును ధ్యానించుట.

ఏకాంతభక్తి యెట్లనగా:- ఈశరీరమున కంతర్యామియైన ఆసద్గురు భగవానుని బ్రహ్మబిందుగ్మయునిగా దెలిసి, ప్రాణవాయువైనను చొరశక్యముగాని, ఏకాంతప్రదేశముజేరి, తదేకలక్ష్యముగలవారై, బ్రహ్మానందముగా నుండుటే.

ఇందలి బాహ్యభక్తివలన, అనన్యభక్తియును, అనన్యభక్తివలన, ఏకాంతభక్తియును కలుగును. ఈత్రివిధభక్తిగలవారే మోక్షముబొందుటకర్హులు.

## ౧౮ పిండోత్పత్తివివరణము.

స్త్రీగర్భంబున శుక్లశోణితములు రెండుకలసి, ఒకరాత్రి చింతపండుపులుసు పెరుగు కలసినట్లును, అయిదు రాత్రులకు నీటిబుగ్గవలెను పదిరోజులకు రేగుపండురీతిగ నుండమై, యిరువది రోజులకు అంకురమై, నెలరోజులకు శిరస్సేర్పడి, రెండుమాసములకు హృదయ కరచరణంబులు, మూడవమాసమున గోళ్ళు,నవరంధ్రములు, యెముకలు నాల్గవమాసమున, సప్తధాతువులు, అయిదవనెలన రోమములుగ పరిణామమొంది, సంపూర్ణతను

కాగానే, ఆరవమాసమున జీవుడు తల్లిగర్భములో దక్షిణ భాగంబునం దిరుగుచు, మాతృభుక్తాన్నపానంబుల వలన తృప్తిం బొందుచు, చర్మము, నాళ్ళు, మాంస, రక్త, మేధ, అస్థి, శుక్లమనెడి సప్తధాతువులు పుష్టిగలిగి, జంతు సంకీర్ణంబగు, విణ్మూత్రగర్తనంబునం దిరుగుచు, క్రిమిభక్షిత శరీరుండై మూర్ఛలం బొందుచు, జరాయువున గప్పబడి, కుక్షియందు శిరంబు మోపుకొని, పృష్ఠగ్రీవాదరుండై, స్వాంగచలనంబునం దసమర్థుండగుచు, పంజరంబునందుండు శకుంతంబు చందంబుననుండి నేడవ నెలయందు, జీవహంస ప్రాణవాయువుతో కూడినదై, దైవకృతంబైన జ్ఞానంబునన్, పూర్వజన్మసుకృతములు దలచుచు, దీర్ఘోచ్ఛ్వాసంబు జేయుచు, సుఖవేశంబును బొందక, వర్తించునంత చేష్టలుంగలిగి, విట్క్రిమిసోదరుండై, యొకదిక్కున నుండక సంచరించుచు, ప్రసూతిమారుతంబులచేత, నతివేపితుండగుచు, అష్టమమాసంబున, జ్ఞానోదయముగలవాడై, సనారీవిశ్వేశ్వర సంవాదములో పద్యం. మును జేసిన తలిదండ్రి మోహాకర ! తానుజేసిన గతజన్మ తలపునెరిగి, అనుభవించుటకై తి నాయాత్మ కృతము ! చేసియుండిన ఫలమేమి చెడదు చెడను ॥ అనినటుల గతజన్మవిచారంబును బొంది దిగులొందుచు, యీ గర్భనరక మనుభవింపజాలనని, సృష్టికర్తయగు విశ్వరూప బ్రహ్మమును ధ్యానముచేయుచు, యీగర్భనరక విముక్తినిం జేయుమనుచుండగా, దొమ్మిదవనెలన ఆభగవానుని వలన బయలువెడలిన విశ్వరూపు లిరువదైదు యింద్రియాధిష్ఠాన దేవతులైన, మమ్ములను గురుపూజలయందు, ఆయాయింద్రియములను, పూజించవలయును. అట్లు పూజించనియెడల ఆయా

యింద్రియములు పనులుచేయకుండునట్లు చేయుదుము అందు వల్ల బాధలు నొందెదవు. అనగానే విశ్వేదేవులారా అటులనే, మిమ్మాల బూజించెదననగా, యిరువదైదు యింద్రియాధిష్ఠాన దేవతలు, రక్షించెదమనిన వెంటనే, జ్ఞాతకు గురుమూర్తి, మనస్సునకు చంద్రుడు, బుద్ధికి బృహస్పతి, చిత్తమునకు క్షేత్రజ్ఞుడు, అహంకారమునకు రుద్రుడు, సమానమునకు జయుండు, వ్యానమునకు విశ్వయోని, ఉదానమునకు అజుండు, ప్రాణమునకు విశిష్టుండు, అపానమునకు విశ్వకర్త, శ్రోత్రమునకు ప్రాచీదిశాది పంచదిగ్మాత్రులు, త్వక్కునకు వాయుదేవుడు, చక్షువునకు సూర్యుడు, జిహ్వకు వరుణుడు, ఘ్రాణమునకు అశ్వనీదేవతలు, శబ్దమునకు సదాశివుడు, స్పర్శకు మహేశ్వరుడు, రూపమునకు రుద్రుడు, రసమునకు విష్ణువు, గంధమునకు బ్రహ్మము, వాక్కునకు అగ్నిహోత్రుడు, పాణికి దేవేంద్రుడు, పాదమునకు ఉపేంద్రుడు, గుహ్యమునకు బ్రహ్మ, పాయువునకు మృత్యువైన యిరువదైదు విశ్వేదేవతలుగల విశ్వరూప దరిశనానుగ్రహమువల్లనే, దశమమాసములో యీ జీవుడు తల్లి గర్భమునుండి బహిర్గతుడైన తరువాత, గురుపూజలందున, గురుదేవుని, శిరో, లలాట, హృదయ, కర, చరణములకు భస్మ గంధాక్షత పుష్పములుంచుటచేతను, పాయుగుహ్యేంద్రియములకు వస్త్రముల నిచ్చుటచేతను, జ్ఞానేంద్రియములకు భస్మగంధాక్షత పుష్పములు చూపించుటచేతను, గురుపూజ యగును. యిరువదైదు ఇంద్రియాధిష్ఠాన, విశ్వేదేవతలు గలిగినటువంటి ఆ విశ్వరూప భగవానుని పూజించినపుడే, వారల అనుగ్రహము బొంది, బ్రహ్మవిద్యాప్రవీణులగుదురు. అట్లు పూజించనియెడల

గర్భమందున్నపుడు జేసిన ప్రమాణము అస్మృతమై మరల జన్మ యందు ఇంద్రియాది బాధలు కలుగును.

## ౧౭ గురునమస్కారవివరణము.

(1) హస్తద్వయ సంయోగముచే నమస్కరించుటే, విధేయత జూపుట.

(2) ప్రదక్షిణముజేసి దండమువలె గురుదేవుని పాదములపై లలాటమునుంచి, భుజ, కర, చరణ, హృదయములు, భూమిమీద నానుకొనునట్లు జేయుటే, ప్రపంచ విషయాధ్యాసలు విడచితినని తెలియజేయుట.

అవ్యక్తాద్యష్టాంగ నమస్కారము
రాగం, నౌరోజి-ఆదితాళము-తత్వము.

పల్లవి॥ అహా జీవమా, సోహమ్మనెగురు, స్తోత్రముజేయవే॥
అహాజీవమా॥ బాహాటముగా, మోహము ద్రెంపుము॥అహా॥

తా॥ ఓ జీవుడా, అదే నేను అనెడి గురువును, మోహపాశములు విడచి బాహాటముగా స్తుతిజేయుము.

(1) గురువరేణ్యపద సరసీరుహములు, ధరనవక్షేపణ జేయ, మరి నుక్షేపణజేయ, తిరోధానములమబోయి, ధరబరగెడు పాత్రపవిత్రమునై పరమాస్తిక్యత భావమ్మొసంగును ॥అహా॥

తా॥ గురుపాద పద్మములకు నాసికముచే శ్వాసను వదలి మరల శ్వాసను పీల్చిన ఆధారమను పృథివి పాత్రో

తిరోధాన మలముబోయి, మరల ఆపాత్ర పవిత్రముగలదై, గురు వేదాంతేశ్వరులయందు, దృఢనమ్మిక కలుగును.

(2) వారిలోకమున వరలుచునుండగ, వరనవక్షేపణజేయ, మరి నుక్షేపణజేయ, స్థిరమాయేయము బోయి, వారిలోకస్థ పాత్రి శుద్ధమై పాపపు సంకల్పములు నశించును ॥ఆహా॥

తా॥ గురుపాద పద్మములకు, వాక్కుచే ఊపిరివదలి, మరల నూపిరిబీల్చిన, స్వాధిష్టానమను జలపాత్రిలో, మాయేయ మలముబోయి, మరల ఆపాత్రి పవిత్రముగలదై, పాపపు సంకల్పములు నశించును.

(3) వీతిహోత్రిమున విశాలజ్ఞుడై, విధినవక్షేపణజేయ, విధినుక్షేపణజేయ, విపులమాయికముబోయి, భాతివహ్నిస్థపాత్ర శుద్ధమై బ్రిహ్మవిషయైక, వాసనగలుగును ॥ఆహా॥

తా॥ గురుపాదపద్మములకు, నేత్రములచే దృష్టినివదలి, మరల దృష్టిని గ్రిహించిన, మణిపూరకమను అగ్నిపాత్రిలో మాయికమలముబోయి, మరల ఆపాత్రి పవిత్రిముగలదై, బ్రహ్మవిచారణయందు ఆశక్తి గలుగును.

(4) పవనలోకమున ప్రజ్ఞానిధియై। పదమవక్షేపణజేయ। పదముక్షేపణజేయ। పరుష కార్మికముబోయి। పవన లోకస్థ। పాత్రిశుద్ధమై। బ్రహ్మవిద్య దృఢభావముగల్గును. ॥ఆహా॥

తా॥ గురుపాద పద్మములకు। తొలువలచే స్పర్శించి। మరల స్పర్శ జేసిన। అనాహతమను వాయుపాత్రిలో। కార్మిక

మలముబోయి । మరల ఆపాత్రి పవిత్రిముగలదై । బ్రిహ్మ విద్య దృఢముగా నిలుచును.

(5) బయలు చక్రమున బ్రహ్మజ్ఞుండై । బయలవ క్షేపణజేయ । బయలుక్షేపణజేయ । భాసురాణవముబోయి । బయలులోకస్థ పాత్రిశుద్ధమై । బ్రిహ్మజ్ఞానము ప్రిజ్వలితంబగు ॥ఆహా॥

తా॥ గురుపాద పద్మములకు । కర్ణములనే శబ్దము వదలి । మరల శబ్దమును గ్రిహించిన । విశుద్ధమను ఆకాశ పాత్రిలో । అణవమలముబోయి । మరల ఆపాత్రి పవిత్రిము గలదై । బ్రహ్మజ్ఞానము ప్రికాశించుచుండును.

(6) గోప్యముఖంబున గుర్తును విడువక । గుణమవక్షే పణజేయ । గుణము క్షేపణజేయ । గుణాహంకృతముబోయి । గోప్య వ క్త్రిస్థ । గుహ శుద్ధంబై । గొప్ప శాంతముతో । కుదురుగనుండును. ॥ఆహా॥

తా॥ గురుపాద పద్మములకు । ఆజ్ఞేయముచే అహంకారము వదలి । మరల నిర్మలాహంకారము గ్రిహించిన । దుష్టాహంకారముబోయి । శృంగాటక పాత్రిశుద్ధమై । మహా శాంతగుణము స్థిరముగా నుండును.

(7) తిలకదేశమున వెలుగులో వెలిగి । నల అవక్షేపణ జేయ । నిలడక్షేపణజేయ । మలినా విద్యబోయి । బలు ఘంటికలో । పరమశుద్ధమై । తొలిదారి దాటి । తొలగక యుండును. ॥ఆహా॥

తా॥ గురుపాదపద్మములకు । ఫాలప్రదేశము నద్దుకొని । మరలనద్దుకొనిన । అవిద్యావరణబోయి । ఘంటికాలింగము శుద్ధమై । గర్భద్వారము దాటి । అటునిటు తొలగకనుండును.

(8) మడుపు సుబ్బయాచార్యాంఘ్రులకు । మాడవక్షేపణజేయ । మాడుక్షేపణజేయ । మాయావరణబోయి పండు శుద్ధమై । భక్త షణ్ముఖుడు । భగవద్దరిశన । మగుచు వెలిం గెను. ॥అహా॥

తా॥ శ్రీమన్మడుపు సుబ్బయాచార్య గురుపాద పద్మ ములకు । బ్రహ్మ బిలపండును తాకించి ॥ మరల తాకించిన । మాయావరణబోయి । అహిరణ్మయ పండుశుద్ధమైన । షణ్ముఖ భక్తుడు । భగవద్దరిశనము జేయుచు ప్రకాశించు చుండెను.

## ౨౦ బాహ్యచతుర్విధ శుశ్రూషలు

(1) స్థాన శుశ్రూష:- గురువులవారు, పరుండు కూర్చొను, స్థానములు శుభ్రపరచుట.

(2) అంగ శుశ్రూష:- గురుస్వామికి అభ్యంగన స్నానాదులు చేయించుట.

(3) భావశుశ్రూష:- గురువరేణ్యులవారి భావమును గ్రహించి । వారికి అన్నపానాదులొసంగి । బ్రహ్మానంద బోధలు స్త్రీ పురుషులు, నేకకాలమందే వినుచుండుట.

(4) ఆత్మశుశ్రూష:- ఆచార్యాత్మను, హృత్పుండరీక మందునిరంతరము ధ్యానించుట.

## ౨౧ అంతర చతుర్విధ శుశ్రూషలు

(1) దృష్టిస్థానమును, ఎరుక మరుపులులేని యునికితో విచారించుటయే స్థానశుశ్రూష.

(2) సూర్య, చంద్ర, బ్రహ్మ, విష్ణు రుద్రేంద్రాదులే। కన్నులు, మొదలగు అవయవములని తెలియుటే అంగశుశ్రూష

(3) పరబ్రహ్మము త్రికాలాబాధ్యమనియు, అదియే తాననియు భావించుటే భావశుశ్రూష.

(4) ఆత్మకు, పుత్ర, మిత్ర, కళత్రాదులు । ఆత్మవలె ప్రియములుగావు గనుక । కూటస్థప్రత్యగాత్మను వేరుకాని, పర బ్రహ్మమగు తనయందు । తాను తప్పక యుండుటే ఆత్మ శుశ్రూష.

## ౨౨ బ్రాహ్యతాపత్రయములు

(1) ఆధ్యాత్మికము:- తన పూర్వ కర్మవల్లగలిగిన కడుపు నొప్పి, తలనొప్పి, పడిశము మొదలైన బాధలు.

(2) ఆదిభౌతికము:- సర్ప, వృశ్చిక, మానవ, పశు వులు మొదలైన వాటివల్ల గలుగు బాధలు,

(3) అధిదైవికము:- వృక్షములు, గోడలు, గృహ ములు, వర్షము, ఎండలు, పిడుగులు మొదలైన వాటివల్ల గలుగు బాధలు.

ఈబాధలు, ఔషధ, మంత్రిములవల్ల నివారణ యగు చుండగా, గురువులెల్లు పోగొట్ట గలరనగా, గురువరేణ్యుల బోధవలన, సంచితకర్మ నశింపజేసుకొని నపుడు మరల శరీరము రానందున, యీ తాపత్రియములు నశియించును.

## 23 అంతర తాపత్రయములు

(1) ఆత్మ సంబంధమైన జీవుడుచేయు, ఆగామి సంబంధమైన, పుణ్య, పాప మిశ్రి కర్మావస్థ॥ స్వాతంత్రిమైన ఆధ్యాత్మికము.

(2) పంచ భూత సంబంధములైన, యిరువది నాలుగు యింద్రియములచే జీవుడు అనుభవించు ప్రారబ్ధ సంబంధమైన సుఖ దుఃఖాది కర్మావస్థ. అస్వాతంత్రిమైన ఆది భౌతికము.

(3) దేవసంబంధులైన అధిదేతలచ్చే రాబోయే ప్రారబ్ధము సూచించునట్టి సంచిత సంబంధమైన కర్మావస్థ॥ స్వాతంత్రా స్వాతంత్ర రహితమైన అధి దైవికము.

## 24 ప్రణవాది మంత్ర తనువు

(1) శ్లో॥ ఓమిత్యేకం పరంబ్రిహ్మ।సర్వతత్వానుగ్రాహకం।
అబ్రహ్మ స్తంభ పర్యంతం । సర్వాను గ్రహకారకమ్॥

తా॥ ప్రణవ బ్రహ్మము బ్రహ్మ విష్ణు రుద్రేంద్రాది త్వాది స్తంభ పర్యంతము వ్యాపకమైయున్నది.

(2) శ్లో॥ ప్రథమంతారకాకారం । ద్వితీయందండముచ్యతే॥
తృతీయం కుండలాకారం । చతుర్థమర్ధ చంద్రకం ।
పంచమం బిందు సంయుక్తం । ప్రణవే బ్రహ్మపంచకమ్॥

తా॥ ప్రణవ బ్రహ్మమునందు కూడుకొనిన తారక, దండ, కుండల, అర్ధ చంద్ర, బిందువులైదు పంచ బ్రహ్మములుగా చెప్పబడుచున్నవి.

(3) శ్లో॥ తారకం సద్యోజాతాయ ।వామదేవాయ దండకం।
కుండల్యం తత్పురుషంచ । ఈశా నంచార్ధ చంద్రకం । అ
ఘోరేభ్యో బిందుమితి । ప్రణవః పంచవక్త్రికః॥-

తా॥ ఆ ప్రణవ బ్రహ్మము । తారకమే సద్యోజాత । దండమే వామదేవ । కుండలమే తత్పురుష । అర్ధ చంద్రమే ఈశాన । బిందువే అఘోర । అను పంచ ముఖములుగలది.

(4) శ్లో॥ సద్యోజాతం ప్రాక్ సుషిరం । వామదేవంతు
దక్షిణ । సుషిరంచ అఘోరేభ్యో । ప్రతీచీ సుషిరం
తథా । తత్పుర్షు ఉదక్ సుషిరం । ఈశోర్ధ్వ సుషిరం
తథా॥-

తా॥ సద్యోజాతమే ప్రాక్ సుషిరము । వామదేవమే దక్షిణ సుషిరము । అఘోరమే ప్రతీచీసుషిరము । తత్పురుషమే ఉదక్సుషిరము । ఈశానమే ఊర్ధ్వసుషిరము.

(5) శ్లో॥ తారకంతు నకారంచ ॥ మకారం దండముచ్యతే ।
శికారం కుండలం ప్రోక్తం । వకార మర్ధచంద్రకం ।
యకారం బిందుసంకాశం । ఏవంపంచాక్షరస్సదా॥-

తా॥ ఆప్రణవ బ్రహ్మమునకు । తారకమే నకారము । దండమే మకారము కుండలమే శికారము । అర్ధచంద్రకమే వకారము । బిందువే యకారము అను పంచాక్షరములు గలవు.

(6) శ్లో॥ నకారో బ్రహ్మణః ప్రోక్తః । మకారో విష్ణురుచ్యతే. శికారో రుద్ర రిత్యాహుః వకారశ్చ మహేశ్వరః । సదాశివో యకారశ్చ । తేపంచమూర్త్రయస్సదా॥

తా॥ ఆ ప్రణవ బ్రహ్మమందు నకారమే బ్రహ్మ, మకారమే విష్ణువు, శికారమే రుద్రుడు, వకారమే మహేశ్వరుడు యకారమే సదాశివుడు, అను పంచమూర్తులుగా వ్యాపించెను.

(7) శ్లో॥ ఆధారేతు నకారస్స్యాత్ । స్వాధిష్ఠానే మకారకం । శికారో మణిపూరేచ । అనాహతవకారకం । విశుద్ధే చయకారశ్చ । ఏవం పంచాక్షరాలయం॥

తా॥ ఆధారచక్రమందు నకారము, స్వాధిష్ఠాన చక్రమందు మకారము, మణిపూరక చక్రమందు శికారము, అనాహతచక్రమందు వకారము, విశుద్ధచక్రమందు యకారముగలదు. ఇవే పంచాక్షరములకు పంచపురములు.

(8) శ్లో॥ అంగుష్ఠంచ నకారంతు । అంగుష్ఠార్ధ మకారకం। శికారశ్చ త్రిపాదంచ । పాదాంగుష్ఠం వకారకం । అణుమాత్రం యకారస్స్యాత్ । నేత్రపంచాక్షరస్సదా ॥

తా॥ నేత్రాంగుష్ఠమే నకారము, అర్ధాంగుష్ఠమే మకారము, త్రిపాదాంగుష్ఠమే శికారము, పాదాంగుష్ఠమే వకారము,

అణుమాత్రమే యకారముగల, పంచాక్షరములు, నేత్రమున వ్యాపించినవి.

(9) శ్లో॥ ఓంకారోవదనాదేషి । వాయకారాభుజద్వయే। శికారో దేహమధ్యేచ । నమకారా పదద్వయే । పంచాక్షరీపరా విద్యా ! సతారాలింగ రూపిణీ॥

తా॥ ముఖమందు ఓంకారము. భుజములయందు వకార యకారములు, దేహమధ్య శికారము, పాదములయందు నకార, మకారములుగలవు. ఆ పంచాక్షరీ పరవిద్యగలదే లింగరూపము॥ అనగా పద్మాసనమువేసి చేతులుచాచిన సోమసూత్రముగల పీఠము, శిరస్సే ఈ పీఠముపైన లింగము జ్ఞానేంద్రియములే పంచముఖములు.

(10) శ్లో॥ తారకంతు శిరఃప్రోక్తం । దండంతు బ్రహ్మదండకం । శ్రోత్రౌతు కుండలాకారం । బాహుంచ అర్ధచంద్రకం । కఠావకాశే బిందుశ్చ । దేహం ప్రణవరూపకం॥

తా॥ శిరస్సే తారకము, బ్రహ్మదండియే దండము, చెవులే కుండలములు, బాహువే అర్ధచంద్రకము, కఠావకాశమే బిందువుగల, దేహము ప్రణవరూపమైనది.

(11) శ్లో॥ నాసికాగ్రే నకారస్స్యాత్ ! జిహ్వాగ్రేతు మకారం । నేత్రాగ్రేతు శికారశ్చ । త్వగింద్రియే వకారకం, కర్ణస్థానే యకారస్స్యాత్ । ఏవం పంచాక్షరస్థలం॥

తా॥ నాసికాగ్రమున నకారము, జిహ్వాగ్రమున మకారము, నేత్రాగ్రమున శికారము. త్వగింద్రియమున వకారము,

కర్ణేంద్రియమున యకారము, ఈ ప్రకారముగా పంచాక్షరములు స్థలములివి.

(12) శ్లో॥ నమః పదంత్వం పదజీవవాచి । శివః పదం తత్పద ఆత్మవాచి । అయేదితా దాప్యసివా చతుర్థి । తస్మాదిదం బ్రహ్మశివోఽస్యఖండం॥

తా॥ నకార, మకారములుగల, త్వంపదార్థ జీవుడు, శికార వకారములుగల, తత్పదార్థ ఈశ్వరుడు, యకారాత్మయం దైక్యమై అఖండబ్రహ్మ శివుడాయెను.

(13) శ్లో॥ అహమేన నకారంతు । మాయాతీతం మకారకం । శికారం సిద్ధమభవం । వైరాగ్యంచ వకారకం । యకారంతు సమస్తంవై । ప్రణవబ్రహ్మ రూపకః ॥

తా॥ న = నేను, మ=మాయాతీతమైనటువంటి, శి=సిద్ధమైనటువంటి, వ = వైరాగ్యముగలిగినటువంటి, య=యావత్తు, ప్రణవబ్రహ్మస్వరూపము.

## ౨౫ చతుర్విధ సమాధులు.

### —* పొల్లు సమాధి. *—

(1) హకారస్వరూపుడైన తాను, సకారముతో చేరక, నేను అను రెండక్షరముల మధ్యనున్న పొల్లునందు చేరి, ఆపొల్లు తానై, ఘంటికయందున్న బిందువును లక్షించగా, వ్యవహారమునకు కారణమైన, రెక్కలువిరిగి, వ్యవహారమున్ను రెక్క-

లున్న, లేక పోవును. అందువల్ల, జీవహంసయనే, పేరు కూడా లేకపోయెను.

—♦ బిందు సమాధి ♦—

(2) హకారస్వరూపుడైన తాను సకారముతో చేరక, హంసయను, రెండక్షరముల మధ్యనున్న, బిందువుయందు చేరి, ఆబిందువుతానై, దళముల మధ్యనున్న దీర్ఘమును లక్షించగా, నడకకు కారణమైన కాళ్లువిరిగి, నడకయున్న, కాళ్ళున్న, లేకపోవును. అందువల్ల కలహంస యనే పేరుకూడా లేకపోయెను,

—* దీర్ఘ సమాధి. *—

(3) హకార స్వరూపుడైన తాను, సకారముతో చేరక రామయను రెండక్షరముల మధ్యనున్న దీర్ఘమందు చేరి ఆదీర్ఘము తానై, మహాకారణశరీరమే ఉపాధిగాగల ప్రత్యగాత్మను లక్షించగా, జపమునకు కారణమైన శిరస్సు తెగి, జపమున్న, శిరస్సున్న, లేకపోవును. అందువల్ల అచలహంసయనే పేరుకూడా లేకపోయెను.

—♦ ప్రత్యక్ సమాధి. ♦—

(4) హకారస్వరూపుడైన తాను ప్రత్యగాత్మను లక్షించగా ఆ లక్ష్యము నిలచిపోయి, ప్రత్యగాత్మయినాడు గనుక, హకారస్వరూపుడుకూడా లేకపోవును. దీనినే తురీయావస్థ యందురు, పంచమావస్థ స్వరూపలయమని చెప్పుదురు.

## —♦ యోగశిఖోపనిషత్. ♦—

శ్లో॥ దివ్యజ్ఞానోపదేష్టారం । దేశికం పరమేశ్వరం ।
పూజయేత్పరయా భక్త్యా । తస్యజ్ఞానఫలంభవేత్ ॥

తా॥ దివ్యజ్ఞానము నుపదేశించినట్టి, పరశివ గురువును, పరమభక్తిచేత పూజించవలయును. గురుపూజ చేశిన వారికి జ్ఞానఫలము లభించును.

## ౨౬ గురుపంచపూజా.

(1) లం॥ పృధివి తత్వాత్మనే॥ సత్యం జ్ఞానమనంతం బ్రహ్మస్వరూపాయ ॥ శ్రీసద్గురు పరబ్రహ్మణేనమః॥ శ్రీగంధం సమర్పయామి॥

(2) హం॥ ఆకాశతత్వాత్మనే ॥ నిత్యానందో బ్రహ్మ స్వరూపాయ॥ శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః ॥ పుష్పం సమర్ప యామి ॥

(3) యం॥ వాయుతత్వాత్మనే॥ నిత్యానంద మయం బ్రహ్మస్వరూపాయ ॥ శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః ॥ ధూపం సమర్పయామి ॥

(4) రం॥ తేజస్తత్వాత్మనే ॥ ఏకమేవాద్వితీయం బ్రహ్మ స్వరూపాయ॥ శ్రీ సద్గురుపరబ్రహ్మణేనమః॥ దీపంసమర్పయామి॥

(5) వం॥ ఆపోతత్వాత్మనే॥ సపకోబ్రహ్మణ ఆనంద స్వరూపాయ ॥ శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః నైవేద్యం సమర్పయామి ॥

(6) సం॥ సర్వతత్వాత్మనే॥ ఆకాశం శరీరం బ్రహ్మ స్వరూపాయ॥ శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః సర్వోపచారాన్ సమర్పయామి॥

## ౨౭ గురువు దృష్టి నిగ్రహియించుట.

బ్రహ్మ వ్రాసిన స్థూల, సూక్ష్మ, కారణ, దేహత్రయము తుడిచి, తురీయ పరకాయ ప్రత్యగాత్మయందు దృష్టి నిగ్రహియించుట.

## ౨౮ శిష్యప్రమాణములు.

(1) మాతృవత్పరదారాశ్చ॥ అన్య స్త్రీలను తన తల్లివలె జూచుట.

(2) అహింసా పరమోధర్మః॥ జీవహింస చేయకుండుట వాటి మాంసము భుజియింపకుండుట పరమధర్మము.

(3) సత్యంవద, ధర్మంచర॥ యదార్థము బలుకుచు, ధర్మముగా సంచరించుట.

(4) పరద్రవ్యాణి లోష్టవత్॥ యితరుల ద్రవ్యము, నపహరించక, మట్టిగడ్డవలెజూచుట.

(5) పరోపకార మిదంశరీరం॥ శరీరము, యితరుల కుపకారమొనర్చవలెగాని, అపకారము చేయరాదు.

## ౨౯ షోడశనామధారణము.

1. పరమాత్మ॥ 2. ప్రత్యగాత్మ॥ 3. అంతరాత్మ॥ 4. చిదాత్మ, 5. బ్రహ్మాత్మ॥ 6. విష్ణ్వాత్మ॥ 7. రుద్రాత్మ॥

8. మహేశ్వరాత్మ, 9. సదాశివాత్మ॥ 10. విశ్వాత్మ॥ 11. తైజసాత్మ॥ 12. ప్రజ్ఞాత్మ॥ 13. పరమహంస॥ 14. రాజహంస॥ 15. ప్రణవహంస॥ 16. పరబ్రహ్మము॥

## ౩౦ గురుమంత్రోచ్చారణము.

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ ॥ ప్రజ్ఞానంబ్రహ్మ ॥ అహం బ్రహ్మాస్మి॥ తత్త్వమసి॥ అయమాత్మా బ్రహ్మ॥ ఓంనమశ్శివాయ॥ ఓంనమోరామాయ॥ ఓంనమోగురవే॥ ఓంనమో విశ్వకర్మణే, ఓంనమోనారాయణాయ॥ హంసశివసోహం॥

## ౩౧ కళ్యాణ హారతి.

రాగం - సురటి - అటతాళం.

(1) కళ్యాణ హారతిదుగో । కర్పూర హారతిదుగో । కమలమందున్నట్టి । గరిమగురుపర్యాసను ॥ కళ్యాణ ॥

(2) తీర్థగూర్ధ్వాధల । త్రిపుటిలోపలనుండె । దివ్యసావాదిత్య । దీప్తిబ్రహ్మమునకు ॥ కళ్యాణ ॥

(3) దశాంగుళపరిమితిలో । దర్పణంబులమధ్య । దహరస్థపరిస్యగా । త్మరూపునకిపుడు ॥ కళ్యాణ ॥

(4) పంచాంగుళములలో । పంచాక్షరీయుక్త । ప్రత్యగభిన్నమైనట్టి, ప్రణవ బ్రహ్మమునకు ॥ కళ్యాణ ॥

(5) పద్మకోశప్రతీ । బల్కాశాతీతుడగు । పరోక్షాపరోక్షుడగు । పరమాత్మునకిపుడు ॥ కళ్యాణ ॥

(6) అంగుష్టమాత్రమౌ । యాపుండరీకమున । అజ్ఞాన రహితమగు । ప్రజ్ఞానబ్రహ్మమునకు ॥ కళ్యాణ ॥

(7) అష్టాక్షరేణాష్ట । యాదళములంగున । అహం బ్రహ్మాస్మి యనె । అహోజ్యోతికిని ॥ కళ్యాణ ॥

(8) తనువుమధ్యంబున । తన్వీపీతాభాస । తత్త్వమసి యనియెడి । ధవళాఖండునకును ॥ కళ్యాణ ॥

(9) నీలతోయదమందు । నిందధనుఃఖండ । నాలుగు నాలుగులో నయమాత్మ బ్రహ్మమునకు ॥ కళ్యాణ ॥

(10) ప్రాదేశమాత్రమను । ప్రబలదేహములోన। ప్రాకు చున్నట్టి । పరమహంసునకును ॥ కళ్యాణ॥

(11) పిండ బ్రహ్మాండముల । రెండహములుగాక న । ఖండముగాయున్న । దండిపూర్ణమునకు ॥ కళ్యాణ ॥

(12) శుద్ధ షణ్ముఖునకు । సుషిరాగ్ని మందుండె । సూక్ష్మాత్మ దెలిపిన । సుబ్బయాచార్యునకు ॥ కళ్యాణ ॥

## 32 అంతరతీర్ధప్రసాదాదులు.

1 తత్త్వంపదములే గురుపాదములు, 2 తత్త్వం పదార్ధములే గురుపాదతీర్థములు, 3. గురువుయొక్క అనుగ్రహమే గురుప్రసాదము, 4. గురుధ్యానమే పరబ్రహ్మ ధ్యానము, 5. గురుమూర్తిని లక్షించుటే పరబ్రహ్మైక్యము, 6. గురుమూర్తి ఆశ్రమమే తీర్థస్థలము.

# 33 బాహ్యతీర్థప్రసాదములు.

నారికేళతీర్థం । కదళీఫలం । ద్రాక్షఫలం । నారికేళఫలం । ఈ మూడుఫలములుగలది త్రివిధప్రసాదము.

శ్లో॥ అజ్ఞానమూలహరణం । జన్మకర్మనివారణం । జ్ఞాన వైరాగ్య సిద్ధ్యర్థం । గురుపాదోదకం పిబేత్ ॥

తా॥ అజ్ఞానము సమూలముగా నశించునటువంటి, జన్మకర్మలు నివారణయగునట్టి, బ్రహ్మజ్ఞానము, లోక విషయముల యందు విరాగము సిద్ధించుటకొరకు, తురీయ గురుపాదతీర్థామృతమును పానముజేయవలయును.

శ్లో॥ బ్రహ్మతేజోఽభివృద్ధ్యర్థం । గురుప్రసాదభోజనం । గురుపూజాదళం పుష్పం । భక్త్యా శిరసిధారయేత్ ॥

తా॥ బ్రహ్మతేజస్సు అభివృద్ధికొరకు, గురుప్రసాదము (ఫలాదులు) భుజియించి, గురుపూజా పుష్పములు భక్తితో శిరస్సున ధరియించవలయును.

నాలుకను ఆజ్యమంటునట్లు, తామరాకున నీరు అంట నట్లు, కుమ్మరపురుగును బురద నంటనట్లు, అద్దమున బింబమంట నట్లు, చల్లలో వెన్న అంటనట్లు, పృథివిపైన నీడ అంటనట్లు, గచ్చకాయను బూడిద అంటనట్లు, పర్వతగుహాయలందు పలుకు లంటనట్లు, గురువుయొక్క, ఉపదేశ, శ్రవణ, తీర్థప్రసాదముల వలన, శిష్యుడు దేహవిలక్షణమయుడు అగును.

## అక్షర హారతి

జయజయహారతి । సద్గురుస్వామికి ।
అర్ధశతాక్షర । ఆనంద హారతి ॥జయ॥

## ౧ దేహేంద్రియాధిష్ఠాన ఋషి చక్రము.

| ఆకాశము | వాయువు | అగ్ని | జలము | పృథివి |
|---|---|---|---|---|
| జ్ఞాతి. సుపర్ణ బ్రహ్మఋషి | మనస్సు ప్రత్న బ్రహ్మ ఋషి | బుద్ధి సానగబ్రహ్మ ఋషి | చిత్తము సనాతనబ్రహ్మ ఋషి | అహంకారం అహంభూన బ్రహ్మఋషి |
| సమానము విశ్వజ్ఞ ఋషి | వ్యానము రుచిదత్త ఋషి | ఉదానము బిభ్రాజ ఋషి | ప్రాణము వామదేవ ఋషి | అపానము భద్రదత్త ఋషి |
| శ్రోత్రము పరిత ఋషి | త్వక్కు వాస్తోష్పతి ఋషి | చక్షువు కశ్యప ఋషి | జిహ్వ విశ్వతక్షు ఋషి | ఘ్రాణము కాండవ ఋషి |
| శబ్దము సూరసేన ఋషి | స్పర్శ కౌశల ఋషి | రూపము మనువిశ్వకర్మ ఋషి | రసము ప్రతితక్షు ఋషి | గంధము విశ్వాకార ఋషి |
| వాక్కు సాంఖ్యాయన ఋషి | పాణి సనాభస ఋషి | పాదము విశ్వాత్మక ఋషి | గుహ్యము సునందన మహర్షి | పాయువు శ్రీముఖ ఋషి |

# ౨ దేహగుణాధిష్ఠాన ఋషి చక్రము.

| ఆకాశము | వాయువు | అగ్ని | జలము | పృథివి |
|---|---|---|---|---|
| ఆశ - మణిభద్రర్షి | ధావన - (పరుగెత్తుట) ప్రహర్షణర్షి | క్షుధ - (ఆకలి) మనుర్షి | లాలా - (చొంగ) మయర్షి | అస్థులు: (ఎముకలు) త్వష్టర్షి |
| లజ్జా - (సిగ్గు) మునిసూరర్షి | కంపం - (వణకుట) లోకవేత్తర్షి | తృష్ణా - (దప్పి) మామన్యుర్షి | మూత్రం - సనత్కుమార ఋషి | మాంసము - యజ్ఞపాలర్షి |
| భీతి - (భయము) శ్రుతివర్ధనర్షి | ఆకుంచనం - (ముడుచుట) శిల్పికమనుర్షి | సుషుప్తి - (నిద్ర) భూబలర్షి | స్వేదం - (చెమట) ధార్మికర్షి | త్వక్ - (చర్మము) కుశధర్మర్షి |
| క్రోధము - యాజ్ఞికర్షి | గమనం - (నడచుట) సహస్రబాహుర్షి | రతి - (మైథునము) సంవర్తర్షి | రక్తము - విధాతృ మనుర్షి | స్నాయవః - (నరములు) తామ్రగర్భర్షి |
| మోహము - సంజ్ఞికర్షి | ప్రసారణం - (చాచుట) దేశికమనుర్షి | ఆలస్యము - విశ్వదత్తర్షి | శుక్లము - ద్విజ ధర్మర్షి | రోమములు - అతిధాతర్షి |

## 3 దేహగుణావరణాధిష్ఠాన ఋషి చక్రము.

| ఆకాశము | వాయువు | అగ్ని | జలము | పృథివి |
| --- | --- | --- | --- | --- |
| కరుణ - ఆదిత్యసేనర్షి | జ్వలనము - వాస్తుపురుషర్షి | నిదగ్ధనము - సమంతర్షి | గుంభనము - వర్ధకర్షి | అన్యశోధనం- లోకేశమనుర్షి |
| ఉపలక్షణం - (సమీపగుర్తు) అర్వంతకర్షి | తాడనము - (కొట్టుట) ఇంద్రసేనర్షి | యోగభావము - శ్వేతాంగర్షి | సూక్ష్మము - భావబోధర్షి | పాలనము - పద్మదక్షర్షి |
| ఉత్ప్రేక్షణము- (చూచుట) అర్చితర్షి | వ్యాపకము - గిరిధర్మర్షి | ఘంటికా - (కూడిక) పురంజయర్షి | సూనృతము - (సత్యవాక్కు) తత్త్వర్షి | అద్భుతము - వితమర్షి |
| ఉపలగ్నము - (పొందునది) కర్దమర్షి | కీర్తి - వసుధర్మర్షి | భీకరము - భానుమాన్ర్షి | సుకృతము - శాంతమతిర్షి | ఉపకరణం - మేధామతిర్షి |
| ఉపద్రవణము - (స్రవించుట) పరార్చిర్షి | వ్యామోహము- వజ్రచేతర్షి | దహించుట - జయపుత్రర్షి | గంభీరము - యజ్ఞసేనర్షి | నిగరణము (గుటక) విశ్వమయర్షి |

## ४ దేహపరయాయ అనాంతరగుణాధిష్ఠాన ఋషి చక్రము.

| ఆకాశము | వాయువు | అగ్ని | జలము | పృథివి |
|---|---|---|---|---|
| మృతి - తేజో ధర్మర్షి | ఘనము - విశ్వభద్రర్షి | చేవన - వనజర్షి | స్వస్థత - చక్షుష్షర్షి | గ్రసము - (పీడించుట) బోధాయనర్షి |
| కారణము - సుదర్శన ఋషి | మననము - జ్ఞాన భద్రర్షి | కాంతి - భాస్వాంతిర్షి | శుభగతం - విశ్వదత్తర్షి | ఉపన్యాసం - జాత రూపర్షి |
| స్మరణము - ఉప గోపర్షి | కుదరము - (ఉపకారం) దేవభద్రర్షి | మోచన - మధుర్షి | విస్తారము - విశ్వతర్షి | భేదనము - చిత్ర సేనర్షి |
| ఉదాహరణము - యజ్ఞర్షి | కల్పనము - వ్యంజకర్షి | యోజనము - (కూర్పు) చిత్రవసుఋషి | స్తంభనము - సుమేధర్షి | సంతుష్టి - జయ సేనర్షి |
| నిష్కర్షణం - (ప్రాయశ్చిత్తము) సాంత్వర్షి | వారణము - (అడ్డుచేయుట) ప్రబోధమనర్షి | విద్యా - తాపసర్షి | ఆరోహణము - సగరర్షి | బోధా - విఘనస ఋషి |

## ౫ దేహావస్థలాధిష్ఠాన ఋషి చక్రము

| ఆకాశము | వాయువు | అగ్ని | జలము | పృథివి |
|---|---|---|---|---|
| తుర్యాతీతం - ఉప కల్పర్షి | తుర్యము - శక్వరర్షి | సుషుప్తి - సుయక్షర్షి | స్వప్నము - రైవత మనుఋషి | జాగ్రత - ప్రభోన్నత మహర్షి |
| జాగ్రత - దేవ సేనర్షి | తుర్యాతీతము - వేదపాలర్షి | తుర్యము - సుతక్షర్షి | సుషుప్తి - ప్రవరర్షి | స్వప్నము - దేవరర్షి |
| స్వప్నము - ఆది త్యర్షి | జాగ్రత - రాజధర్మర్షి | తుర్యాతీతం - ప్రబోధర్షి | తుర్యము - జయ ధన్వర్షి | సుషుప్తి - వినయర్షి |
| సుషుప్తి - నిగ మర్షి | స్వప్నము - భోక్తవ్య మనుఋషి | జాగ్రత - విశాలో చనర్షి | తుర్యాతీతము - విద్యార్షి | తుర్యము - బ్రహ్మ దీక్షార్షి |
| తుర్యము - ఉప యజ్ఞర్షి | సుషుప్తి - ప్రజ్ఞామతిర్షి | స్వప్నము - చిత్ర ధర్మర్షి | జాగ్రత - పరిషంగర్షి | తుర్యాతీతము - హరి ధర్మర్షి |

యజుర్వేదమందు, అయంపురోభువాది మంత్రములలో —మనో. చక్షుః-శ్రోత్ర, వాగింద్రియము లైదింటికి, పంచ ఋషులు అధిపతులనిగలదు.

ఛాందోగ్యోపనిషత్తుయందు ప్రాక్ సుషిర, దక్షిణసుషిర, ప్రతీచీ సుషిర, ఉదక్ సుషిర, ఊర్ధ్వసుషిరములైదింటికి పంచ బ్రహ్మలు అధిపతులనిగలదు.

సానగ, సనాసన, అహభూన, ప్రత్న, సుపర్ణ బ్రహ్మర్షు లైదుగురకు పంచవింశత్యుత్తర శతబ్రహ్మర్షులు, (అయిదు అయిదులు, యిరువదైదు, యిరువదైదు అయిదులు, నూట యిరువదైదుగురు) జనియించి, దేహేంద్రియాధిష్ఠాన, దేహ గుణాధిష్ఠాన, దేహగుణావరణాధిష్ఠాన, దేహాంతరగుణాధి ష్ఠాన, దేహావస్థలాధిష్ఠానులుగా ప్రకాశించుచుండిరి. పంచ భూత విభాగములే, ఇంద్రియాదులైనందున, పంచభూతాధిప తులగు సానగాదులే, ఇంద్రియాదుల కధిపతులైరి. వేదోపనిష దాదులందు, పంచీకరణములను, దేవతలు, ఋషులు, బ్రహ్మలు, అధిపతులైనట్లు స్పష్టపడుచున్నందున విట్లను ఋషిపంచీకరణము లనిరి.

దేహేంద్రియాధిష్ఠాన ఋషి పత్నులు

సుపర్ణర్షి ప్రత్నర్షి సానగర్షి సనాతనర్షి అహభూనర్షి
జ్ఞానశక్తి. క్రియాశక్తి. ఆదిశక్తి, పరాశక్తి ఇచ్ఛాశక్తి.
చంచలాక్షీ. రక్తాక్షీ. సులక్ష్మీ. కటాక్షిణీ. నీలవేణీ.
మంగళాంగీ. ధర్మవతీ. అదితిః. చారులోచనా. సుమిత్రా.

అంగనా. లీలావతీ, కళ్యాణీ. కోమలాంగి. సుందరాం
అర్ద్రిమతి. సుయోగినీ. సుమంగళాదేవీ. గంధవతీ. సుమానస

దేహగుణాధిష్ఠాన ఋషిపత్నులు

సుఖీ. సుప్రతీకా. శ్రద్ధాదేవీ. పద్మా. విభాషా.
లావణీ. శనైర్యాచీ. కమలా. అలకా. రంజనీ.
లలితా. చంద్రిగంధి. భాషాదేవీ. సునీతీ. దరహాసినీ.
కేళీ. జ్ఞానవాక్. రామా. విశాలాక్షీ, సుముఖీ.
వామాక్షీ. సీమంతినీ. చారుమతీ. కామాక్షీ. సుందరాంగీ.

దేహగుణావరణాధిష్ఠాన ఋషి పత్నులు

వనితా. పావనీ. ధృతీదేవీ. సుగామినీ. చారునేత్రీ.
సుధీదేవీ. జల్పకీ. సాత్వికాదేవీ. తారుణికా. సువర్చా.
రమణీ. ప్రకాశినీ. సుగుణీదేవీ. ఊహమతీ. సుపచీ.
భామినీ. వరమతీ. స్వాత్మాదేవీ, కౌమారీ. సుదేవీ.
ధర్మిణీ. సురభీ. భోగవతీదేవీ. అరుణేక్షణా. నిరామయీదేవీ.

దేహావాంతర గుణాధిష్ఠాన ఋషి పత్నులు.

శ్రీకరీ. అకుంఠినీ. శుచీదేవీ. సువాక్. సుబోధినీ.
అమృతవాక్. శుభ్రాంగీ. సుకుమారీ. శుభాంగీ. వార్తాళీ.
ధర్మశ్రవా. మంజుభాషిణీ. మందహాసినీ. సుమారీ. బగళా
మహిళాదేవీ. వేదవతీ. సుధీమణీ. తారాక్షీ. బాలా.
రక్తోష్టీ. సత్యవతీ. సుందరీ. శీతేక్షణా. చిత్రాంగీ

అవస్థల పంచీకరణ ఋషిపత్నులు.

మధురవాణీ. సౌహార్ద్రవతీ కంజవాక్. వేదినీ. చిత్రభాషిణీ. శ్రీపర్ణినీ. భోగినీ. మందగమనా. కృష్ణకేశినీ. ఉచ్చాంగీ. మాలినీ. మధురాక్షీ. ప్రజ్ఞావతీ. కాంతా. కలకంఠీ. మాయాదేవీ. అమలవతీ. ప్రభావతీ. తారుణీ. గౌరీ. మహతీ. భాసురాంగీ. శాంతమతీ. మోదవతీ. శివకరీ.

# 3వ దే వు డె వ రు.

జడపదార్థములైన, పసుపు, సున్నము, నీరు కలసి
యెఱుపురంగు కలిగినట్లు, కరక్కాయనీరు, అన్న భే
వండినపుడు, నల్లరంగు సిరా అయినట్లు, జడపదా
శుక్లశోణితములు, స్త్రీ గర్భములో కలియగా,
యుక్త దేహములు కలిగెను. వేపచెట్టు, ముష్టి
తీపిగుణము గలుగనట్లు, పంచభూతాంశములవల
అజ్ఞానదేహములచేత జ్ఞానాత్మ గలుగనేరదు. దేహ
మాగా ప్రజ్ఞానబ్రహ్మము, సాక్షిగానుండి, యెని
అద్దములమధ్య దీపమొక రూపముగానున్నట్లు, స
లందలి క్షీరములొక తెలుపుగానున్నట్లు, నదీనదసమ
మేఘములలో నుదక మొకరూపముగా నున్నట్లు, పి
బ్రహ్మపర్యంత దేహములలో ప్రకాశించుచు, జాగ
మూడు అవస్థలయందు, సమస్తముచు గుర్తెరుగుచు, త్రికా
బాధ్యమై, ఏకరూపముగానున్న ఆత్మజ్ఞానమే సత్యము, ప్రత్య
క్షమగునది. యదార్థమైనది. మేఘములవంటి అవస్థాత్రయ
మందును, సూర్యునివంటి స్వయంప్రకాశమైన జ్ఞానమేచిత్తు,

సదా ఉపాధి రహితమైన నిరుపమ ప్రియమే నిత్యజ్ఞానానందము. సజాతీయ, విజాతీయ, స్వగతభేదములు లేనట్టి, లక్షణత్రయము గల బ్రహ్మమే ఏకమేవాద్వితీయ మయినదేవుడు. ఇట్టిదేవుడు పాలనుతరచి వెన్నతీసినటుల, నువ్వులు గానుగాడి తైలముతీసినటుల, గోస్తనములు పిండి క్షీరములు తీసినటుల, దేహములు తరచినగాని లభించడు.

## 3౬. నవాంతర యోగములు.

(1) దహరావకాశములో హంసోహమ్మనెడి మంత్రి
మంత్రియోగము.

(2) జీవేశ్వరులు, మాయా విద్యా వరణలు విడిచి
మునలయమై చిత్తము చలించకుండుటే, లయ

హాకార, సకారములు, బ్రహ్మబిందువునందు చేరి,
ౕదలక, సూదంటురాయివలెనుండుట, హఠయోగము.

4) సూర్యచంద్రులు, పరమాత్మయందు కలసి, ప్రాణ
వును, సంచరింపజేయకుండుటే, రాజయోగము.

(5) తత్వవిచారణచేసి, పంచవింశతి సంఖ్యలను, స్థాన
ఃన ప్రత్యగాత్మను తెలియుటే, సాంఖ్యయోగము.

(6) తన్నుతానెరిగి తరించుటే, తారకయోగము.

(7) సంకల్పరహితమైన మనస్సుగల, అనుభవజ్ఞానమే, అమనస్క యోగము.

(8) హంసరూపుడైన తాను పరమహంస యగుటయే, హంసయోగము.

(9) హిరణ్మయతనువందలి, ప్రత్యగాత్మను, సుఖ సుషుమ్నద్వారా, ధ్యానించుటే, ధ్యానయోగము.

## 38 అంతర షణ్ముద్రలు.

(1) గంధగ్రహణశక్తి గల, పృధివినాడిపైన, బిందురూపమందు, దృష్టి నిలుపుటే, భూచరీముద్ర.

(2) దహరావకాశమునందు, జ్ఞాననేత్రము వికసింప జేసి, చలించకుండుటే, ఖేచరీముద్ర.

(3) సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన, గోప్య, షణ్ముఖముల కంతర, షట్కోశమందు, దృష్టి నిలుపుటే, షణ్ముఖీముద్ర.

(4) నీవారశూకమధ్య, ప్రజ్ఞాన చిచ్ఛక్తి నిజూచి, చలించకుండుటే, శాంభవీముద్ర.

(5) ఘంటికాలింగ చక్రయుక్తమైన, శివజీవాత్మ తనువులమధ్య, ప్రత్యగాత్మయందు, దృష్టినిలుపుటే, మధ్యమముద్ర.

(6) బాహ్యాంతరములందు, నిర్వికార అచలపరిపూర్ణ పరబ్రహ్మముగా ప్రకాశించుటే చిన్ముద్ర.

## 3౭ జీవబ్రహ్మైక్యము.

యజుర్వేదం॥ ౪ కాం॥ ౬ ప్ర॥ ౨ అను॥ 3 మం॥

విశ్వకర్మాహ్యజనిష్టదేవ, ఆదిద్గంధర్వో। అభవద్ద్వితీయః తృతీయః పితాజనితౌ షధీనాం ॥ తా॥ హృత్పుండరీకమునందు ముందుగా విశ్వకర్మ పరబ్రహ్మ మావిర్భవించి, ఘంటికయందు రెండవవాడగు, గంధర్వుడను ఈశ్వరుడు, ఆజ్ఞేయమందు, మూడవవాడైన, ఓషధీపాలకుడుగు, సోముడను జీవుడునాయెను. ఇనుము, పరుసముగలసిన బంగారమై, మరల బంగారము ఇనుముకానట్లు, వెన్నకాచిన ఘృతమై, మరల ఘృతము వెన్న కానట్లు, స్వాతివర్షము ముత్యపుచిప్పలలోబడి ముత్యమై, మరల ముత్యము జలముకానట్లు, కీటకము భ్రమరమై, మరల భ్రమరము కీటకము కానట్లు, కాల్చిన మట్టిపాత్ర మరల పాత్ర గానట్లు, ఈజీవాత్మ విశ్వకర్మ బ్రహ్మమునం దైక్యమైన, మరలా బ్రహ్మము జీవుడుగాడు.

## 3౮ దశాంతరసిద్ధులు.

(1) ఆకాశగమనసిద్ధి:- ఆసమంతాత్ కాశత ఇత్యాకాశః॥ అంతట ప్రకాశముగల పరిత్యాగాత్మయందు సంచరించుట.

(2) పరకాయప్రవేశసిద్ధి:- హిరణ్మయే పరేకోశే అను, తురీయదేహమందు ప్రవేశించుట.

(3) అయోనిసంభవ సిద్ధి:- మహాకారణ దేహములో నిలచిన తాను, కారణశరీరమనెడి, యోనిదేహములోనికి రాకుండుట.

(4) దూరశ్రవణసిద్ధి:- చిణి, చిణి, శంఖ, భేరి, ప్రణవ, హంస, వీణ, మృదంగాది, దశవిధనాదములు, యోగనిష్ఠలో నాలకించుట.

(5) దూరవీక్షణసిద్ధి:- ఊర్ధ్వరేతస్కుడైన బ్రహ్మమును ఘంటికాయంత్రముద్వారా జ్ఞాననేత్రముతో జూచుట.

(6) జలస్థంభనసిద్ధి:- గంగా, యమునా, సరస్వతులుగా ప్రవహించుచున్న ఆగామి, సంచిత, ప్రారబ్ధత్రయములనెడి కర్మ నీటిని సంచరింపజేయకుండుట.

(7) అగ్నిస్తంభనసిద్ధి:- మాయావిద్యలనెడి కట్టెలను, తరచి, జ్ఞానాగ్నిని ప్రజ్వలింపజేయగా, క్రమక్రమేణ, తానంతట నదియే, చల్లారి, బూడిదయగుట.

(8) వాయుస్తంభన సిద్ధి:- ప్రాణాపాన వాయువులు సంధింపజేసి, సంచరించకుండునట్లుచేయుట.

(9) వాక్స్తంభనసిద్ధి:- పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరీ, చతుర్వాక్కులను చలింపజేయక, అంతరలక్ష్యాను సంధానుడవుట.

(10) కాయసిద్ధి:- మరుపులనెడి, స్థూల, సూక్ష్మ, కారణ, శరీరములకు, వ్యతిరిక్తమైన, ఎరుకయనెడి, బ్రహ్మ క్షేత్రమును, హిరణ్మయదేహమును పొందుట. ఇదియే స్వర్ణసిద్ధి యగుట, కాయసిద్ధియగుటయని ద్వివిధముగా చెప్పబడినది.

# ౪౦ దేహాంతర దేవతలు.

(1) ప్రకాశమైన జ్ఞాననేత్రమను కాశీలో, శబ్ద, స్మృతి, శ్వాసలు, లీనముగలదే శివలింగము. ఆగామి, సంచిత, ప్రారబ్ధములనెడి కర్మనీరే, ఈలింగమునకు అభిషేకమగును.

(2) ఆధారాది ఏడవదగు, సహస్రార కొండలోనున్న, ప్రజ్ఞానబ్రహ్మమే వేంకటేశ్వరుడు.

(3) అజ్ఞానమనే దుష్టుని నశింపజేసిన, ప్రజ్ఞానకృష్ణుడు, సుషుమ్నయనే వేణునాదము పూరించి ఆ నాదముచే, ఆనందించుచున్నాడు.

(4) సుషుమ్నయను స్తంభమునుండి వెడలిన, నృశింహమూర్తి, హకార, సకారములనే గోళ్ళచే, అజ్ఞానుడైన దుష్టుని సంహరించెను.

(5) సహస్రారములో: నీవారశూకమందు ప్రకాశించు, విశ్వకర్మ పరమాత్మ, జాగ్రత, స్వప్న, సుషుప్తి, తుర్య, తుర్యాతీతావస్థలయందు, సృష్టి, స్థితి, లయ, సుఖ, ప్రకాశములు గలుగజేయుచుండెను. విశ్వ=ప్రపంచమునకు లోపల, వెలుపల, బృహతీతిబ్రహ్మ=వృద్ధిగల బ్రహ్మముగనుక, విశ్వబ్రహ్మముగా నుండెను.

(6) సమస్తజీవులను రంజింపజేసి, సంసార సముద్రమునుండి తరింపజేయు, విశ్వకర్మపరబ్రహ్మమే ఆత్మారాముడు. విశ్వకర్మాయను చతురాక్షరములలో, ర్మా, అను రేఫ, మకారములు విడదీయగా, వి. శ్వ. క. రా. మ, అను పంచాక్షరము

లవును. యిరువదినూ డక్షరములుగల గాయత్రీ మంత్రములో వరేణ్యం, అను వాక్యము, వరణీయం అని విడదీయగా, యిరు వదినాలుగు అక్షరములైనట్లే అయినది. యజుర్వేదోక్త, ఓం నమోవిశ్వకర్మణేయను, అష్టాక్షరీ మంత్రములోని దే, రామ శబ్దము. విశ్వ = ప్రపంచ, క=సుఖమును, రామ=రంజింపజేయు వాడు అనియు, విశ్వ=ప్రపంచమునకు, క=బ్రహ్మము, రామ= మనోహరమైనదనియు, వి = విశేషేణ, (విశేషముగా) శ్వ = శ్వయతి వర్ధతీతి, (వృద్ధిబొందు) క = సుఖం (బ్రహ్మానందసుఖ మును) రామ = రమతీతి రామ, (రంజింపజేయువాడు) విశ్వకర్మా, విశ్వక=విశ్వబ్రహ్మము, రేఫ, మకారసంయుక్త, ర్మా, అను రామ, మనోహరమైనదిగ యుండెను.

(7) సర్వదేహములకు మూలమైన, బ్రహ్మకపాలమునం దలి, పరంజ్యోతియే. జ్ఞానసేత్రము. ఇదేఉపనయనము వేగుచుక్క ఆపోజ్యోతి, దివ్యజ్యోతి

(8) అకార, ఉకారములే కోరలుగల, మకారమునే శేషమే, ఆదిశేషుడుగా, దహరాకాశమను పుట్టలో, ప్రకా శించుచుండెను.

(9) ఆధారాది కమలములందున్న, బ్రహ్మ, విష్ణు, రుద్ర, మహేశ్వర, సదాశివ, గణమునకు, అధిపతిగానున్న, ప్రత్యగ్విశ్వకర్మ, గణాధిపతి.

(10) బ్రహ్మరంధ్రముందున్న, బ్రహ్మబిందువే, సమస్త జీవులను ప్రేరేపణజేయు సూర్యుడు.

(11) పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరీ, చతుర్వాక్కులకు పతిగల పరబ్రహ్మమే, వాచస్పతి విశ్వకర్మా, యజుర్వేదములో,

వాచస్పతిం విశ్వకర్మాణమూతయే అనిగలదు. విశ్వ (సమస్త) కర్మలు, నిర్మించువాడైనందున, విశ్వకర్మ యనబడెను.

(12) పరబ్రహ్మమునందలి, చిచ్ఛక్తియే, బాహ్యాంతర గంగా, సరస్వతీ, యమున, ఆరునదులమీద, సమస్త భ్రాంతులు విడిచెడి, ఘంటికయను ముక్తికంతలోపల, జగదంబగా ప్రకాశించుచుండెను. శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారి కాలజ్ఞానతత్వములలో, ఆరునదులమీద అంబ వుందన్నా యనియు గలదు.

(13) ఆగామి సంచిత ప్రారబ్ధములనెడి, కర్మజలమే స్థానముగాగల, ప్రత్యగాత్మే నారాయణుడు.

(14) తురీయములో తురీయమను కళయే, అలోక చంద్రుడు. ఈశ్వరుడు ధరించిన దీ చంద్రుడే.

(15) శ్రీశైలమను సహస్రారకొండలో, హిరణ్మయ కోశమను శిఖరాంతరమందు, ప్రకాశించు పరమాత్మే, పరశివ మూర్తి. ఆరుచక్రములపైన దేవుడున్నచక్రమే, దేవశిఖా చక్రము.

(16) గాయత్ర్యుపాధియనెడి, తురీయదేహముగల, బ్రహ్మ క్షేత్రమందలి బిందువే, బ్రహ్మము. పరబ్రహ్మము, గురుబ్రహ్మము, వీరబ్రహ్మము, రామబ్రహ్మము, లింగబ్రహ్మము, ప్రణవబ్రహ్మము, విశ్వబ్రహ్మము, నాదబ్రహ్మము, సనాతనబ్రహ్మము, శిల్పిబ్రహ్మము, పంచముఖబ్రహ్మము, తారకబ్రహ్మము, పూర్ణ బ్రహ్మము, మొదలైన అనేక నామాంతరములుగలవి.

# ౪౧ పిండబ్రహ్మాండసంబంధములు.

(1) పిండాండమనగా శరీరం. బ్రహ్మాండమనగా జగత్తు.

(2) పిండాండములో బ్రహ్మాండమనగా, ఉత్తమాంగము.

(3) పిండాండం చిన్నగడియారం. బ్రహ్మాండం పెద్ద గడియారం, గనుక ఈరెంటియందు, సంబంధములు, ధర్మములు, సమానముగానేయున్నవి.

(4) పిండాండమున, బిందురూపమైన ప్రజ్ఞానుడు, పిండాండమందలి ఇంద్రియములను॥ బ్రహ్మాండమున గుండ్రని సూర్యుడు, బ్రహ్మాండమందలి జగత్తును, ప్రకాశింప జేయుదురు.

(5) అసావాదిత్యో బ్రహ్మ, ప్రజ్ఞానం బ్రహ్మయని, శ్రుతిప్రమాణములవుటచే, సూర్యుడు, ప్రజ్ఞానుడు, బ్రహ్మస్వరూపులేయైరి.

(6) శరీరమందలి ప్రజ్ఞానుడు, జాగ్రదాది మూడు అవస్థలయందున, విశ్వ, తైజస, ప్రాజ్ఞులై, సృష్టి, స్థితి, సంహారములున్ను॥ ఆకాశమందలి, సూర్యుడు, త్రికాలములయందున, శ్లో॥ బ్రహ్మస్వరూపముదయే। మధ్యాహ్నేతు మహేశ్వరం। సాయంధ్యాయేత్సదావిష్ణుం। త్రిమూర్తిశ్చదివాకరః॥ అను ప్రమాణముచే బ్రహ్మ, రుద్ర, విష్ణుమూర్తులై వృద్ధి, క్షయ, పోషణలున్ను జేయుచుండిరి.

(7) పిండాండమున ప్రజ్ఞానుడు లేకున్నను, బ్రహ్మాండమున సూర్యుడు లేకున్నను, భయముగలుగును.

(8) అష్టదళములమధ్య, జీవసాక్షియను ప్రజ్ఞానుడున్ను, చతుర్దిక్కులల, చతుర్మూలలమధ్య, ప్రభాకరుడైన సూర్యుడున్ను ప్రకాశించుచుండెదరు.

(9) ప్రజ్ఞానుడు, జీవునకు సాక్షియై॥ సూర్య, చంద్ర నక్షత్రాదులకు, సాక్షియై, వీరిద్దరు వీట్లను ప్రకాశింపజేయుదురు.

(10) ప్రజ్ఞానుడు, ఉపజిహ్వాద్వారా, అమృతవర్షమును॥ సూర్యుడు, మేఘముద్వారా, నిర్మలవర్షమును, కురిపించుదురు॥ ఆదిత్యాజ్జాయతే వృష్టిః అను ప్రమాణరీతిగా.

(11) యిడా, పింగళ, సుషున్నలనే, మూడునదుల యందు, హంసయనే ప్రజ్ఞానుడు॥ త్రిపథయను ఆకాశగంగ యందు, హంసయనే సూర్యుడు ప్రకాశించును॥ భానుర్హంస సహస్రాంశుః ॥ హగ్ంసశ్శుచిషద్వసు రంతరిక్షయను, ప్రమాణరీతిగా॥

(12) పిండాండమున, ఆధార, స్వాధిష్ఠ, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞేయ. షట్చక్రములు, ఘంటిక. సహస్రార, అణు, విణు, శిఖా. పశ్చిమచక్రములకు। బ్రహాండమున, పృధివ్యాది పంచభూత మండలములు, చంద్ర, సూర్య, ధృవ, నక్షత్ర, మెరుపు, పెంజీకటి, మేఘమండలములకు, నావల, పరిపూర్ణాచల పరబ్రహ్మము, శూన్య చక్రమందు ప్రకాశించును.

(13) నీవారశూక, ఉర్వారుకశూక. అగ్నిశిఖలయందు, పరమాత్మయున్నట్లు॥ సూర్యమండలమందు, పరమాత్మ ప్రకా

శించును॥ సూర్యమండలమధ్యవర్తీ నారాయణః అనుటచే నారాయణుడే పరమాత్మ యనబడును.

(14) ఘటాకాశ, మహాకాశము లేకమైన నటుల, పిండాండ ప్రత్యగాత్మ. బ్రహ్మాండపరమాత్మ లేకమైరి.

(15) ఆగామి, సంచిత, ప్రారబ్ధ త్రయకర్మనీరు, దహరాకాశమునుండి, ఇడా, పింగళ. సుషుమ్నలయందు, మూడునదులుగావచ్చెను॥ ఆకాశమునుంచి, హిమవత్పర్వతము ద్వారా, గంగా, యమునా, సరస్వతులనే, మూడునదులుగా, ప్రవహించుచుండెను.

(16) బ్రహ్మదండి కగ్రమున, దహరాకాశ మందు ప్రజ్ఞానుడు॥ మేరువయొక్క అగ్రమందు, మహాకాశమున, సూర్యుడు ప్రకాశించుచుండిరి.

(17) ప్రజ్ఞానమను హంస, నిత్యము బ్రహ్మదండికిచుట్టూ ప్రదక్షిణముజేయుచు, సూర్యచంద్రనాడులద్వారా, ఆజ్ఞయను ఉదయాద్రి మొదలుకొని, ఆధారమను హస్త్రాద్రిపర్యంతము దిరుగును॥ సూర్యుడనుహంస నిత్యము. మేరువచుట్టూ ప్రదక్షిణముజేయుచు, ఉత్తరాయణ, దక్షిణాయనములద్వారా, ఉదయాద్రిమొదలుకొని, హస్తాద్రి పర్యంతము దిరుగును.

(18) ప్రజ్ఞానుడు, కదలక తనసత్తాచే, అష్టదళపురముల యందున, అష్టవృత్తులు ప్రకాశింపజేసెను॥ ర్యుడు తనప్రభచేత, చతుర్దిక్కుల, చతుర్కోణలయందున, అష్టమర్యాదగిరులను ప్రకాశింపజేసెను.

(19) శబ్ద, స్పరిశ, రూప, రస, గంధ, మాయావిద్యలు అనే యేడు గుఱ్ఱములు. జీవుడే రథము, పూర్వకర్మే సారధి, ప్రజ్ఞానుడే రథికుడుగాను, ప్రకాశించుచుండెను॥ సప్తాశ్వముల రథము, అనూగుడనే సారథితో, సూర్యుడనేరథికుడు, ప్రకాశించుచుండెను.

(20) పంచభూత దళములమధ్య, పంచవన్నెలుగల, ప్రజ్ఞానబ్రహ్మబిందువు. మహాకాశపంజరమున, పంచవన్నెల కిరణములుగల, గుండ్రని సూర్యుడు, ప్రకాశించుచుండెను.

(21) ఆజ్ఞేయ, ఘంటిక, శింశుమార, సహస్రార, అణ్, విణ్, శిఖా, పశ్చిమ, శూన్యములనే, నవచక్రములు గల,, బ్రహ్మనాళ శిఖరాగ్రమున, ప్రత్యగాత్మ ప్రకాశించుచుండెను॥ ఇంద్రి, వరుణ, గభస్తి. నాగర, తామ్రి, వారుణి, మాల్యవత్, కేతుమాల, భరతఖండముల, తొమ్మిదింటిలో, భరతఖండ పశ్చిమదేశంబున, సూర్యుడు ప్రకాశించుచుండెను.

(22) అష్టమూర్తులయొక్క మధ్య, ప్రజ్ఞానబ్రహ్మ బిందువు. చతుర్దిక్పాలకుల, చతుర్విదిక్పాలకుల మధ్య, గుండ్రని సూర్యబింబము, ప్రకాశించుచుండెను.

(23) బ్రహ్మవేత్తలు, ప్రత్యగాత్మను, అజపగాయత్రి మంత్రముచేతను, యజ్ఞోపవీతధారులు, సూర్యుని గాయత్రి మంత్రముచేతను, ధ్యానించి. ఆస్వరూపులగుచున్నారు.

(24) ఆజ్ఞేయం చంద్ర, ఘంటిక ధృవ, సహస్రారం సూర్య, అష్టదళపద్మం శింశుమార, అవకాశమందలి ప్రజ్ఞాను, నక్షత్రి, మహాకారణం విద్యుత్ । శిఖాపెంజీకటి । మండలములు।

పిండాండమందున్నటుల॥ చంద్ర, సూర్య, నక్షత్ర, శింశుమార, మెరుపు, ధృవ, వెంజీకటి, మండలములును, బ్రహ్మాండమున గలవు.

(25) బ్రహ్మదండికి, క్రింద రంధ్రమందు, సర్పమున్నట్లు॥ మేరువక్రింద పాతాళబిలమందు. ఆదిశేషుడు ఉండెను.

(26) పిండాండమున కనులుమూసిన చీకటి, దశవిధ నాదములు. ప్రత్యగాత్మకళ, జిహ్వాఽమృతమున్నట్లు॥ బ్రహ్మాండమున, మేఘమువచ్చిన చీకటి, ఉరుములు, మెరుపులు, వర్షములుండును.

(27) ఆధారాది సప్తచక్రములు, ఘంటిక, అణో, విణో, శిఖా, పశ్చిమ చక్రములు, మొత్తం ఈపన్నెండుచక్రములందును ప్రజ్ఞానుడు ద్వాదశమూర్తులుగాను॥ పంచభూతములు, చంద్ర సూర్య, నక్షత్ర, ధృవ, మేఘ, మెరుపు, వెంజీకటి మండలము లన్నిటియందు, సూర్యుడు, ద్వాదశాత్మలుగాను ప్రకాశించు చుండిరి.

(28) బ్రహ్మాండమున ధూళిలేచినను, వర్షమొచ్చినను, అగ్ని యెక్కువైన, చలిగాలివీచిన, సూర్యోదయమైన, హస్త మించినను॥ పిండాండమున, నలిచిన మట్టివచ్చును. అల్పాచ మాన మధికమగును. తాపము, ఆకలికలుగును. చలిబెట్టి గడ గడ వణకును, జాగ్రత్తయు, సుషుప్తియు కలుగును.

(29) పిండాండమున పంచతన్మాత్రలు, జాగ్రత, స్వప్న, సుషుప్తులు, యెగిమిదున్నట్లు॥ బ్రహ్మాండమున, ఐరావత,

పుండరీక, వామన, కుముద, అంజన, పుష్పదన్త, సార్వభౌమ, సుప్రతీకఅను నీ యెనిమిది, దిగ్గజములుగా, విదిగ్గజములుగా గలవు.

(30) వెన్నెముక, పెనుబాము, శరీరమునకెట్లు ఆధారమో॥ అట్లు బ్రహ్మాండమునకు, మేరువ ఆదిశేషుడు ఆధారము.

(31) ప్రజ్ఞానుడు, ఆధారాది దిగువచక్రము లన్నియు॥ సూర్యుడు, దిగువ చంద్ర పంచభూతాది మండలములన్నియు, ప్రకాశింపజేయుదురు.

(32) జీవునకు, యిరువదైదు యింద్రియములే, స్థూల దేహ మైనట్లు॥ ఈశ్వరునకు, ఆయిరువదైదు, యింద్రియాధిష్టాన దేవతలే, స్థూలదేహమాయెను.

(33) జీవునకు, పదిహేడు ఇంద్రియములే, సూక్ష్మ దేహమైనట్లు॥ ఈశ్వరునకు, ఆ పదిహేడు ఇంద్రియాధిష్టాన దేవతులే సూక్ష్మదేహమాయెను.

(34) జీవునికి అజ్ఞానమే (చిత్తము జ్ఞాతతోకూడి) కారణ దేహమైనట్లు॥ ఈశ్వరునకు మాయయే (క్షేత్రజ్ఞుడు, గురు మూర్తితోగూడి) కారణదేహమాయెను. ఇవియే జీవేశ్వరులకు షష్ట తనువులు.

(35) పిండాండమున, ఆధారాది దశచక్రములు, వీటి యందు బ్రహ్మాదిమూర్తులున్నటులే॥ బ్రహ్మాండమున, పాతాళాది దశలోకములు. వీట్లయందు, ఆదిశేషుడు, నివాతకవచ కాలకేములు. (శ్రీహరి) ధృవవధూటయునే సర్పం, మయుడు, బలి

చక్రవర్తి, హాటకేశ్వరుడు, బలాసుర, సూర్య, చంద్ర, ధృవు లను, ఏదిమూర్తులుగలరు॥ పిండ బ్రహ్మాండములపైన, అచల పరిపూర్ణ పరబ్రహ్మముండెను.

(36) కార్యమైన పిండాండములో, అగ్ని, జలము, గాలి, తగ్గినయెడల॥ కారణమైన బ్రహ్మాండములోనుంచి, సూర్య వేడిమి, వర్షకూపాదిజలము వాయువును, గ్రహించుచున్నారు.

(37) ఆజ్ఞేయంసూర్య, ఘంటికచంద్ర, సహస్రారం, అగ్నియనే నక్షత్ర, అష్టదళం శింశుమార। తుర్యంధృవ। తుర్యాతీతం పెంజీకటికి సంబంధము॥ ఆమీద సర్వాంతరఅచల పరిపూర్ణ పరబ్రహ్మము.

(38) బ్రహ్మకపాలమందలి ఆజ్ఞేయం, ఘంటిక, దహర, హిరణ్మయ, శిఖయందున్న పంచావస్థలే ఈశ్వరునివి॥ ఆజ్ఞే యాది దిగువ చక్రములయందలి, పంచావస్థలే, జీవునివి.

(39) దక్షిణాయన, ఉత్తరాయణ, విషువులనే, మూటియందు, సూర్యుడు తిరుగునట్లు॥ యిడా, పింగళ, సుషుమ్నలనే మూటియందు, జీవుడు దిరుగుచుండును.

(40) పిండాండమున, 21600 హంసలు సోహం సోహం అన్నటుల॥ బ్రహ్మాండమున 2000 వాలఖిల్యులు, సూర్యుని యెదుట సౌరసూక్తములు పఠించెదరు.

(41) మానసోత్తర పర్వతమునకు చివర, సూర్య రథ చక్రము, సంవత్సరాత్మకంబై, నిత్యము మేరువను ధృవుంచుట్లూ, ప్రదక్షిణముజేయునట్లు॥ ఆజ్ఞాచక్రమునకు, తుదహంస చక్ర

మనే జీవచక్రము, హంసాత్మకంబై, నిత్యము బ్రహ్మదండియను, ధృవంచుట్టూ దిరుగుచుండును॥ ఆజ్ఞేయమానసోత్తర పర్వతములను, సంబంధముగలను, బ్రహ్మదండి మేరువునకు సంబంధము గలదు.

(42) ద్వాదశాంగుళములే, ద్వాదశ మాసములు ఆయెను.

(43) షట్చక్రములే, షడ్రుతువులు, సూర్యచక్రమే, ఆజ్ఞాచక్రము.

(44) యిడా, పింగళలురెండు. మనస్సు మారుతములచే, కట్టినట్లు॥ సూర్యచక్రమందలి రెండిరుసులు, వాయువు మహావాయువులచే కట్టబడియె.

(45) సూర్యుడు, ఉదయాద్రి, మేరుపర్వత, హస్తాద్రిల యందున్నప్పుడు॥ ఆజ్ఞేయం, కంఠ, హృదయములందు, జాగ్రత, స్వప్న, సుషుప్త్యావస్థలు, జీవుడు బొందును॥ రవిమేరు శిఖరాగ్రవర్తిగానున్న, గురుస్థానదృష్టిగల జీవుడు, నాభియందు తురీయావస్తను పొందును॥ రవిమేరువ వెనుకనుంచి ఉత్తరాభిముఖుడైన, నిర్మలదృష్టిగల జీవుడు, లింగస్థానమందు తురీయాతీతావస్థను పొందును. ఇవి కార్యరూపములైన, పంచపురముల అవస్థలు.

(46) సూర్యుడు, ఉత్తరమునను౦డి, ఉదయాద్రికివచ్చి, ఉదయించగానే॥ జీవుడు ఆధారాది చక్రములద్వారా, అపసవ్యంగావచ్చి, ఆజ్ఞేయమున జాగ్రతపొందును,

(47) రవిమేరు సమీపముననున్న, జీవుడు ఘంటిక యందు, స్వప్నము బొందును.

(48) రవి హస్తాద్రికివచ్చిన, జీవుడు అవకాశములో, సుషుప్తి బొందును.

(49) రవి మేరుశిఖరమందున్న, జీవుడు మహాకారణమున, తురీయము బొందును.

(50) రవిమేరువవెనుక, ఉత్తరాభిముఖుడైన, జీవుడు శిఖయందు, తురీయాతీతమును పొందును. ఇవి కారణరూపములైన, పంచపురముల అవస్థలు.

(51) అష్టదళములు. నాళాంతం, దుద్దు, దుంప, నాళం. అను పన్నెండును, పరమహంస చక్రములు॥ పంచభూతములు, సూర్య, చంద్ర, మేఘ, నక్షత్ర, ధృవ, విద్యుత్, పెంజీకటి, అను పన్నెండును, పరబ్రహ్మ చక్రములు॥ పిండబ్రహ్మాండములందలి యీచక్రములకుపైన, అచలపరిపూర్ణాద్వైతపరబ్రహ్మము గలదు.

(52) ఆజ్ఞేయాది షట్చక్రములు, అజ్ఞానములైనవి॥ సూర్యమండలం మొదలు, పాతాళంవరకు, దుష్టసంపత్తుగలవి॥ ఆజ్ఞేయం మొదలు శూన్యచక్రంవరకు, జ్ఞానములైనవి॥ సూర్యమండలంమొదలు పెంజీకటిమండలంవరకు, శిష్టసంపత్తుగలవి.

(53) రవి, మాంద్య, తీవ్ర, సమానములుగా, త్రికాలములందు నడచినట్లు॥ జీవుడు, త్రినాడులయందు, ఆరోహణ, అవరోహణ, సమాన నడకలు జేయుచుండును.

(54) బ్రహ్మాండములో, బ్రహ్మాండమందలి, ఈశ్వరునకు, సూర్యగోళకమే స్థూలం, చంద్రగోళకమే సూక్ష్మం, నక్షత్రగోళకమే కారణం, ధృవగోళకమే మహాకారణం, పెంజీకటియే నిర్మహాకారణములుగా నున్నట్లు॥ పిండాండములో, బ్రహ్మాండమందలి జీవునకు, సిద్ధయోనియే స్థూలం, ఘంటికయే సూక్ష్మం । దహరాకాశమే కారణం । హిరణ్మయకోశమే మహాకారణం, నీవారశూకాగ్రమే, నిర్మహాకారణ।శరీరములుగా నుండెను॥ ఉభయపంచ దేహ పురముల కతీతమున, నిరావరణమైన అచలపరిపూర్ణ పరబ్రహ్మము గలదు. ఇదియే ద్వాదశాంతమైన శూన్యస్థానము.

(55) పిండాండస్థూలమున విశ్వుడు వేధ॥ సూక్ష్మమున తైజసుడు తృటి, కారణమున ప్రాజ్ఞుడు త్రసరేణువు, మహాకారణమున, ప్రత్యగాత్మ అణువు । నిర్మహాకారణమున పరమాత్మ పరమాణువు। ప్రమాణములుగా నున్నట్లు॥ బ్రహ్మాండమున, విరాట్, హిరణ్యగర్భ అవ్యాకృత, ఆదిత్య (ప్రత్యగాత్మ) విశ్వకర్మ (పరమాత్మ) లు నంతే ప్రమాణములుగా నున్నారు.

(56) బ్రహ్మాండమందలి నిత్యపంచభూతములు, పరమాణు రూపములైన, పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశములున్నట్లు॥ పిండాండమందలి, అనిత్య పంచభూతములు, కార్యరూపములైన, శరీరములు, జ్ఞానేంద్రియములుగాను॥ బ్రహ్మాండమందు, అనిత్యములైన, మృత్పాషాణాది । పృథివి, ౧ = సరిత్సముద్రాది జలము, ౨ = పిడుగు, విద్యుదాదిఅగ్ని ౩ = వృక్షాదికంపనవాయువు, ౪ = ధ్వన్యాకాశము ౫ = గాను యున్నవి.

(57) బ్రహ్మాండమండలి పరమాత్మకు, సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానదిక్కులే, పంచముఖములుగా నున్నట్లు॥ పిండాండమందలి ప్రత్యగాత్మకు, పృధివ్యప్తేజోవాయ్వాకాశములనే, ప్రాక్సుషిర, దక్షిణసుషిర, పశ్చిమసుషిర, ఉదక్ సుషిర ఊర్ధ్వసుషిరములైదు. పంచముఖములుగా నుండెను.

(58) పిండాండమందలి హంసయే ప్రజ్ఞానుడు, బ్రహ్మాండమందలి పరమహంసయే, పరమాత్మయనబడును.

(59) వాచ్యార్థములైన, జీవేశ్వరు లిద్దరిని, వదలుటయను మోక్షమును॥ లక్ష్యార్థములైన, ప్రత్యగభిన్న పరమాత్మ లిద్దరిని, విడుచుటయును ముక్తిగలిగినపుడే॥ అద్వైతాచల పరిపూర్ణ పరబ్రహ్మమనబడును.

(60) పిండాండములో జ్ఞానేంద్రియములే కారణముగాను॥ ఆధారాది పంచచక్రములే కార్యముగానున్నవి.

(61) మేషాది మీనాంత ద్వాదశ రాసులయందు, సూర్యాది నవగ్రహములు సంచరించుచున్నటుల॥ శక్తి, సమన, ఉన్మని, యను ద్వాదశాంగుళములు (లేక) అష్టదళములైన, పృధివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, అహంకారము, మహత్తు, అవ్యక్తములును, కేసర, కర్ణిక, దుద్దు, దుంప, అను ద్వాదశరాసులయందున॥ ప్రతినిత్యము, బ్రహ్మ, విష్ణు, రుద్ర, మహేశ్వర, సదాశివ, విరాట్టు, హిరణ్యగర్భ, అవ్యాకృత, మూలప్రకృతియను, తొమ్మండ్రుగురు, సంచరించుచుందురు.

(62) బ్రహ్మాండమందు, ఈశ్వరరూపము, ఈశ్వరసృష్టి వలె॥ పిండాండమందు, జీవస్వరూపము, జీవసృష్టియుగలదు.

(63) బ్రహ్మాండమందు, కాలమునుబట్టి ఫలములు గ్రహించినటుల॥ పిండాండమందు స్వరమునుబట్టి, ఫలములు గ్రహించవలెను.

(64) బ్రహ్మాండమందు సూర్యునివల్ల గలిగిన మేఘము, సూర్యుని కప్పినట్లు॥ అగ్నివల్లగలిగిన ధూమము, అగ్నినికప్పినట్లు॥ పిండాండమందు, ఆత్మవల్లకలిగిన పంచకోశములు, మూడు దేహములు, ఆత్మను కప్పుచున్నవి,

(65) బ్రహ్మాండమందు సూర్యునియందున్న వివిధ రంగులు, నీరుగల మేఘములయందుపడి, ఇంద్రధనస్సుగా ప్రకాశించునటుల॥ పిండాండమందు ప్రజ్ఞానదనే సూర్యునియందున్న వివిధరంగులు, కర్మపీఠసంబంధమైన పృధివ్యాది అద్దముల యందుపడి, ఇంద్రధనస్సుగా ప్రకాశించుచుండెను.

(66) బ్రహ్మాండమందు ౧ సూర్యుడు, ౨ కిరణములు, 3 యండ, ౪ యండమావులు, ౫ యండమావుల తండము, ౬ యండమావుల యందలి అలలు, నురుగులు, ౭ యండ మావులయందలి జలము, ౮ జలవ్యాపకము, ౯ ఆజలమందలి అలలు, బుగ్గలు॥ దృష్టాంతముగానున్నటుల॥ పిండాండమందు ౧ ప్రజ్ఞానం, ౨ చిచ్ఛక్తి, 3 జడశక్తి, ౪ లేనిమాయ, ౫ మూలావిద్య ౬ తులావిద్య, ౭ అవ్యక్తము, ౮ మహత్తు, ౯ అహంకారము॥ దార్ష్టాంతముగాగలవు.

(67) సూర్యుడు. పంచభూతయుక్తమైన, ప్రపంచ మంతయు, ప్రకాశింపజేయుచున్నను, దానియందు ఛాయాశక్తి నిమిడయున్నటుల॥ ప్రజ్ఞానబ్రహ్మము, పంచభూతయుక్తమైన శరీరమంతయు ప్రకాశింపజేయుచున్నను, ఆప్రజ్ఞానబ్రహ్మమునందు, మాయాశక్తి నిమిడియుండెను,

(68)బ్రహ్మాండమందలి సూర్యప్రకాశము,బహిర్ముఖమై, దిగువ సమస్తవస్తువులను, చూపించునట్లు॥ పిండాండమందలి ప్రజ్ఞానముయొక్క సత్తా, ముందటిదళములద్వారా బహిర్ముఖమై, సమస్తవస్తువులను, గుర్తింపజేయుచుండెను.

(69) పిండాండములోనుంచి పోయినజీవులు. బ్రహ్మాండమున, సూర్య, చంద్ర, నక్షత్ర. ధృవాది మండలంబుల, తల్లోకంబులందు. వారివారి పుణ్యానుసారంబుగ నుందురనియు॥ అక్కడనుంచివచ్చిన జీవులు, పిండాండములందు బుట్టుదురనియు, సిద్ధాంతముగాన, పిండబ్రహ్మాండముల రెంటికి, యెడతెగని సంబంధము గలదని యెరుగవలయును.

(70) అజ్ఞానులు వేదకర్మాచరణవలన, కర్మసిద్ధియు, శివ, సూర్య, నారాయణాది, మంత్రోపాసనార్చనాదులవలన, కైలాస, వైకుంఠ, స్వర్గాది, విషయానంద మొందినట్లు॥ జ్ఞానులు, సాంఖ్య, తారక, అమనస్కాది విచారణలవలన, మోక్షసిద్ధియు॥ ఏకాక్షరాది, ద్వాదశి, పంచదశి, షోడశాంతమైన, మంత్ర, మంత్రార్థ, మంత్రరహస్య, మంత్రసార, మంత్రానుభవములచే, బ్రహ్మానందమొందెదరు.

(71) పిండాండమందలి, సచ్చిదానంద నిరుపమనిర్మల, పంచలక్షణ సహిత ప్రత్యగాత్మ॥ బ్రిహ్మాండమందలి, సత్యజ్ఞానానందాఖండ పరిపూర్ణత్వ, పంచలక్షణసహిత, పరమాత్మరహితమే, అచలాద్వైత పరిపూర్ణ పరబ్రిహ్మము అనబడును.

(72) ఋంజనులు నడుపుటకు, అధికారులున్నటులే॥ పిండాండమందు, అవిద్యావరణ, కర్తృత్వ, భోక్తృత్వ, కించజ్ఞత్వాదులుగల జీవుడు॥ బ్రిహ్మాండమందు, మాయావరణ, సర్వజ్ఞత్వ, సర్వేశ్వరత్వ. సర్వాంతర్యామిత్వాదులుగల ఈశ్వరుడు॥ అధిష్ఠాతలయి, పిండబ్రిహ్మాండములు నడుపుకురు.

(73) జ్ఞానులు, పిండాండ బ్రహ్మకపాలమందు, ఈశ్వరపితృ, ప్రత్యక్పితామహ, పరమాత్మ ప్రపితామహుల వర్గత్రయ॥ గాయత్రీమాతా। చిచ్ఛక్తి పితామహీ। పరబ్రిహ్మణీ ప్రపితామహీ, వర్గత్రియ, విచారణలచే, అంతరమాతాపితాదుల ఋణముతీర్చినట్లున్న॥= అజ్ఞానులు, బ్రహ్మాండ, బ్రహ్మకపాలక్షేత్రమందు, పితృ పితామహ, ప్రపితామహ, వర్గత్రయమునకు, మాతృ, పితామహి, ప్రపితామహి, వర్గత్రయమునకు, తర్పణాదులిచ్చి, బాహ్యమాతా, పితాదుల ఋణము తీర్చుచుండిరి.

(74) బ్రహ్మాండమందలి, పృథివికి గంధగుణము, జలమునకు రసగుణము, అగ్నికి రూపగుణము, వాయువునకు స్పర్శగుణము, ఆకాశమునకు శబ్దగుణము, సూర్యునకు తేజోగుణము, చంద్రినకు ఆహ్లాదగుణము, మేఘమునకు మెరుపుగుణము, కలిగినట్లు॥ పిండాండములో, బ్రహ్మాండమందలి, ౧ ఈశ్వర

తనువు, అవ్యక్తపత్రమైన తూర్పుదళమందు. హంసవాలినపుడు, శ్వేతవర్ణముగల ధర్మబుద్ధియు॥ ౨ ఈశ్వరతనువు, మహత్తు పత్రమైన ఈశాన్యదళమందు, హంసవాలినపుడు, వైడూర్య వర్ణముగల ద్రవ్యదానబుద్ధియు॥ 3 ఈశ్వరతనువు, అహంకార పత్రిమైన, ఉత్తరదళమందు, హంస వాలినపుడు, పీతవర్ణము గల, సుఖశృంగార అతిప్రీతికరబుద్ధియు॥ ర ఈశ్వరతనువు, ఆకాశపత్రమైన. వాయువ్యదళమందు, హంస వాలినపుడు, మాణిక్యవర్ణముగల, గమన, చలనాది బుద్ధియు॥ ౫ జీవతనువు, వాయుపత్రమైన, పశ్చిమదళమందు, హంస వాలినపుడు, స్ఫటికవర్ణముగల, క్రీడావినోదబుద్ధియు॥ ౬ జీవతనువు, అగ్ని పత్రమైన, నైరుతిదళమందు, హంస వాలినపుడు, నీలవర్ణముగల, పాపకర్మ, హింసాదిబుద్ధియు॥ ౭ జీవతనువు, జలపత్రిమైన, దక్షిణదళమందు, హంసవాలినపుడు, కృష్ణవర్ణముగల క్రూర బుద్ధియు॥ ౮ జీవతనువు, పృథివిపత్రిమైన, ఆగ్నేయదళమందు, హంసవాలినపుడు, రక్తవర్ణముగల, నిద్రాలస్యాదిబుద్ధియు గలుగుచుండును॥ ఇవే అష్టతనువులు.

(75) ఘడియారమున, గంటలు॥ నిమిషములు, సెకండులు, తిరుగుచున్నటులే. స్థూల, సూక్ష్మ, కారణ, దేహములయందు బ్రహ్మసంబంధమైన హంసలు జరుగుచుండును.

(76) వేదకర్మకులు, అమృతస్య దేవధారణో భూయాసమితి । శ్రుత్యుక్తముగా॥ అమృతస్య = కైవల్యప్రాప్తమునకు, దేవధారణః=దేవుని ధరియించుట, భూయాసం= అవుగాకయుని, దేవ, శిఖాచక్రి, గాయత్రీధరియించి, జపముచేయుదురు.

బ్రహ్మవేత్తలు, హేదేవ=ఓదేవుడా, అమృతస్య=నశించని బ్రహ్మజ్ఞానముయొక్క, ధారణః = ధరియించుట. భూయాసం=అవుగాకయని, సహస్రారమను దేవశిఖా చక్రధారులై, బ్రహ్మసంబంధమైన హంస సంచారకర్మల విచారణచేసి॥ సాలోక్యమను, సహస్రార సత్యలోకములో జేరి. సామీప్యమను ప్రత్యగాత్మ సామీప్యమున నిలచి, సారూప్యమను, ప్రత్యగాత్మ రూపనుయి, సాయుజ్యమను, పరమాత్మలో నైక్యమై, పర బ్రహ్మముగానే ప్రకాశించెదరు.

## ४७ పూర్వోత్తరజన్మలు.

జీవుడు అల్పజ్ఞుడైనందున, ఈజన్మమందే జరుగు జాగ్రత్స్వప్నావస్థలయందుజేయు, వ్యవహారములను, గాఢసుషుప్తియందు స్మరించలేడు. స్వప్నావస్థయందు స్మరించినవన్నియు, తప్పక జాగ్రతలో నచించజాలడు॥ గతించిన ఫలానా సంవత్సరమున, మాసమున, వారమున, యేమిచేసినావని అడిగినదానికి తిరిగి యేమియు చెప్పజాలడు॥ ఒక ఇంద్రియముతో పనిచేయునపుడు, మరియొక ఇంద్రియముతో పనియేమియు చేయలేనందున। జీవుడు పూర్వాపర జన్మలయందు చేసినకర్మలు గుర్తించజాలడు॥ ఫలానా కర్మచేసితినని గుర్తులేనప్పుడు, పూర్వాపర జన్మకర్మల ఫలమెట్లు జీవుడనుభవించగలడనగా॥ రోగి యేదోనొక అపత్యముజేయుటచే ఈవ్యాధి ననుభవించుచుంటి ననుకొనునుగాని, ఫలానా కారణమువల్ల, నీరోగమనుభవించుచుంటినని తెలుసుకొనకున్నను॥ వైద్యుడు ఫలానా పదార్థములు భుజియించినందువల్ల, ఫలానాపనులు చేసినందువల్ల,

నితనికీవ్యాధి సంభవించినదని గుర్తించి, ఆరోగికి తగిన ఔషధ మిచ్చి, అల్పమధిక పత్యములు జేయమని యాజ్ఞాపించినటుల॥ జీవుడుచేసిన కర్మానుసారముగ, సర్వజ్ఞుడైన పరమేశ్వరుడు, పునర్జన్మద్వారా, సుఖదుఃఖాదు లనుభవించమని, శాసించును॥ సూక్ష్మదేహము నశించనివారు, కైలాస వైకుంఠ, స్వర్గలోక ములకు బొందెలతోనే వెళ్లెదమని, సూక్ష్మదేహముతో వెళ్ళి, అయా లోకములలో సుఖదుఃఖములు బొందుచు మరల, యేకర్మలకు తగిన ఆయాదేహముల నెత్తెదరు॥ ఇందువల్ల, పునర్జన్మ, పూర్వజన్మ, యున్నదనియే సిద్ధాంతము॥ ఈవిత్త నమువల్ల చెట్టు॥ చెట్టువల్ల విత్తనము గలుగునట్లేజన్మలెత్తెదరు॥ ప్రాజ్ఞముఖమందు బుట్టిన తాను, సమాధి. యోగనిష్ఠలచే, మరల నాప్రాజ్ఞముఖమందు లయమైనపుడే, పునర్జన్మ రాహిత్య మగుననుటకు సందేహములేదు. కర్మవిత్తనం నశించిన, దేహ మనే చెట్టురాదు.

## ౪౩ పంచగ్రంధిరహితము.

౧ పూర్వజన్మగ్రంథి = మాయ లేకపూర్వము. జన్మ లేనందున, వాచ్యార్థ భ్రమగల పూర్వజన్మము, స్వప్నమందలి దేహంవలె తోచునది, పంచదశాకురివంటిది, మాయాసంబం ధమైన, పూర్వజన్మగ్రంధి (ముడి) రహితమిది.

౨ మాతాపితృల గ్రంధి = నాతల్లిదండ్రులని నీవు కోరి వచ్చినట్లయిన, శిష్టాచారాది ఉత్తమకులములలో, ధనవంతుల గృహములలో, జన్మించవలయును॥ వీడు నాకుమాగుడని, ఇది నాకుమార్తెయని, వారు తెచ్చుకొనినట్లయిన, అంగవైకల్య

ములులేని, మంచి స్వభావములు, దివ్యమైన తెలివితేటలు, రూపు, రేఖ, విలాస, సంపూర్ణాయుర్దాయముగల బిడ్డలనే తెచ్చుకుందురు॥ ఇదియును, మరణము, మరుపు, నిద్ర, సమాధి, మూర్ఛలుగల, పంచావస్థలలో లేదుగాన, మాయా సంబంధమైన, గ్రంధిరహితమైనదే.

3 యోనిసంభవసిద్ధి=అహంబ్రహ్మాస్మియని నీవు ఆత్మ దృష్టిలోయున్నట్లయిన, యోనిసంభవుడవుకావు. జీవభ్రాంతిలో నుండి, యోనిసంభవుడనని భ్రమపడుచుంటివి, యోనిసంభవ మనుట స్వప్నావస్థయే, గర్భములో సంభవమైన నీవు, వెలుప లకువచ్చినావుగనుక, కారణ, (యోని) దేహమునకురాక, తురీయిదేహమందే నిలచినావు గనుక, యోనిసంభవుడవుకావు, ఇదే సత్యమైనది. షోడశాక్షరివంటిది. యోనిసంభవ గ్రంధి రహితమిదియే.

౪ పంచభూతగ్రంధి = బ్రహ్మముయందు, మాయాసం బంధమైన, పృధివ్యాది పంచభూతములు లేనందున, బ్రహ్మమైన నీవు, పంచభూతయుక్తుండవనుట అసంభవము, ఇది షోడశాక్షరి వంటిదిగనుక. పంచభూతగ్రంధరహితుడవే నీవు.

౫ పునర్జన్మగ్రంధి=అచలపరిపూర్ణ పరబ్రహ్మముకంటె, అన్యమైన శేషమేమియు లేనందున, నీవుః నిర్వికార, నిర్ద్వంద్వా. ర్వాచనీయ. అఖండ, నిరంజన, నిరావరణ, అచలపరిపూర్ణ, రబ్రహ్మము, పునర్జన్మ గ్రంధిరహితుడవు॥ ఇదే ద్వాదశాక్షరీ.

# ౪౪ సంఖ్యానామములు.

## —* ఏకసంఖ్య. *—

౧ అఖండం, ౨ అమృతం, ౩ అక్షయం, ౪ అవ్యయం, ౫ మూలాక్షరం, ౬ బిందువు, ౭ ఓంకారం, ౮ ఆత్మ, ౯ ఏకాక్షరం, ౧౦ పరంజ్యోతి, ౧౧ లింగం, ౧౨ అద్వైతం, ౧౩ పరిపూర్ణం, ౧౪ అచలం, ౧౫ పరబ్రహ్మము, ౧౬ సాక్షి.

## —* ద్విసంఖ్య, *—

1 క్షేత్రక్షేత్రజ్ఞులు
2 పరాపరములు
3 జీవేశ్వరులు
4 ఆత్మానాత్మలు
5 జీవబ్రహ్మలు
6 సదసద్రూపములు
7 జ్ఞానాజ్ఞానములు
8 విద్యావిద్యలు
9 దృక్, దృశ్యములు
10 ప్రకృతి పురుషులు
11 విషయి, విషయములు
12 ఉపమానోపమేయములు
13 దృష్టాంతదార్ష్టాంతములు
14 సాక్ష్యాసాక్ష్యములు
15 శివశక్తులు
16 దేహిదేహములు
17 పరోక్షాపరోక్షములు
18 జడాజడములు
19 పుణ్యాపాపములు
20 ధర్మాధర్మములు
21 క్షరాక్షరములు
22 సత్యాసత్యములు
23 నిజానిజములు
24 ఇహపరములు
25 చిజ్జడములు
26 సుఖదుఃఖములు
27 కార్యకారణములు
28 జగజ్జీవులు
29 సాకారనిరాకారములు
30 ఎరుకమరుపులు

31 ప్రత్యక్పరమాత్మలు
32 రాకడపోకడలు
33 ఆదిఅంతములు
34 జననమరణములు
35 కర్మజ్ఞానములు
36 బంధమోక్షములు
37 కించజ్ఞత్వ, సర్వజ్ఞత్వము
38 నిశ్చయసంశయములు
39 అధ్యారోపాపవాదములు
40 గురుశిష్యులు
41 స్వర్గనరకములు
42 జన్మకర్మలు
43 వాచ్యార్థ, లక్ష్యార్థములు
44 బింబప్రతిబింబములు
45 చలాచలములు
46 చరాచరములు
47 స్థావరజంగమములు
48 భేదాభేదములు
49 వ్యష్టిసమిష్టులు
50 ఖండాఖండములు
51 చేతనాచేతనములు
52 ఉపాదానోపాదేయములు
53 ఆధారాధేయములు
54 పాత్రాపాత్రలు
55 ద్వైతాద్వైతములు
56 జ్ఞప్తినిర్జ్ఞప్తులు
57 వివేకావివేకములు
58 నిత్యానిత్యములు
59 నీవు నేను
60 ప్రమేయాప్రమేయములు
61 లింగాంగములు
62 బిందుబొంబెలు
63 ఊహాపోహాలు
64 ఐహికాముష్మికములు
65 మొరుకపరిపూర్ణములు
66 ధర్మిధర్మములు
67 జన్యజనకములు
68 స్వాభావికాగంతుకములు
69 విశేషణ విశేష్యములు
70 చంద్రిచంద్రికలు
71 పూర్వపక్షసిద్ధాంతములు
72 ఛాయాసూర్యులు
73 మూలావిద్యా,
తులావిద్యా
74 సూర్యచంద్రులు
75 సంకల్పవికల్పములు
76 భావాభావములు
77 లక్ష్యాలక్ష్యములు

78 వైశ్వకర్మణీ, విశ్వకర్మలు
79 లాభాలాభములు
80 జయాపజయములు
81 శీతోష్ణములు
82 మానావమానములు
83 సవికల్ప, నిర్వికల్పములు
84 ముఖ్యార్ధం, గౌణార్ధం
85 విహిత, నిషిద్ధములు
86 నిందాస్తుతులు
87 క్షుత్పిపాసలు
88 శోకమోహములు
89 జరామరణములు
90 లోకాలోకములు
91 పిండబ్రహ్మాండములు
92 బాహ్యాంతరములు
93 ఉత్క్షేపణ, అవక్షేపణలు
94 ఆరోహణ, అవరోహణలు
95 ఊర్ధ్వకుండలీఅధోకుండలీ
96 దృష్టము, అదృష్టము
97 విదేహముక్తి, జీవన్ముక్తి
98 ఊర్ధ్వాధస్మరణము
99 వామదక్షిణములు
100 ఉశ్వాసనిశ్వాసలు
101 సవ్యాపసవ్యములు
102 ఉపకారాపకారములు
103 దేవతలు, పూర్వదేవతలు
104 సాధువులు, మూర్ఖులు
105 మాంసాహారులు
శాఖాహారులు
106 ఆర్యులు, అనార్యులు
107 దయా, నిర్దయులు
108 శుద్ధాశుద్ధములు
109 నాగరికా నాగరికులు
110 దుర్జనులు, సజ్జనులు
111 ఆచారము, అనాచారము
112 యోగ్యులుఅయోగ్యులు
113 స్త్రీ పురుషులు
114 స్థిరాస్థిరములు
115 వరదాభయములు
116 దష్టత్వ, శిష్టత్వములు

—* త్రిసంఖ్య. *—

1 అకార, ఉకార,
మకారములు
2 రజస్సత్వ తమోగుణములు
3 శిఖాపశ్చిమశూన్యములు
4 నాదబిందుకళలు
5 ఇడాపింగళసుషుమ్నలు

6 గంగా యమునా సరస్వతులు
7 దృక్, శబ్ద, సంకల్పములు
8 బయులు, లోబయులు, నిశ్చయలు
9 చూపు, లోనిచూపు, లేనిచూపు
10 లక్ష్యము, అంతర్లక్ష్యము, నిర్లక్ష్యము
11 నిద్ర, లేనినిద్ర, నిర్నిద్ర
12 రాకడ, పోకడ, నిలకడ
13 రేచక, పూరక, కుంభకం
14 జాగ్రత్స్వప్నసుషుప్తులు
15 మెరుపు, తెలుపు, నలుపు
16 సూర్య చంద్ర అగ్ని మండలములు
17 బ్రహ్మ విష్ణు రుద్రులు
18 ధ్యాతృ, (ధ్యానించువాడు) ధ్యాన, (ధ్యానము జేయునది) ధ్యేయము (ధ్యానించతగినది)
19 నామరూపక్రియలు
20 సత్తుచిత్తు ఆనందములు
21 స్థూల సూక్ష్మకారణములు
22 చూపు, మనస్సు, వాయువు
23 సాంఖ్యతారక అమనస్కములు
24 తత్పద, త్వంపద, అసిపదములు
25 జ్ఞాతృ, (తెలుసుకొనువాడు) జ్ఞాన (తెలుసుకొనునది) జ్ఞేయం (తెలియదగినది)
26 భాస (వెలుగు) భాసక (వెలుగించువాడు) భాస్యము (వెలిగించదగినది)
27 ఆసన, ముద్ర, లక్ష్యములు
28 చిన్నాదబిద్బిందుచిత్కళలు
29 కలా, పూర్ణ, దర్శదృష్టులు
30 తిర్యగూర్ధ్వాధత్రిపుటులు
31 హకార, సకార, బిందువులు
32 సత్యజ్ఞానమనంతములు
33 గురు, శిష్య, బోధలు
34 ద్రష్ట్ర (చూచువాడు) దర్శన (చూచునది) దృశ్యము (చూడబడునది)

35 విశ్వ, తైజస, ప్రాజ్ఞులు
36 ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, అధిదైవికములు
37 ఆగామి, సంచిత, ప్రారబ్ధ కర్మలు
38 ఆరంభ, పరిణామ, వివర్త వాదములు
39 దహర, ఘంటిక ఆజ్ఞేయ, త్రిస్థానములు
40 కాయిక, వాచికేంద్రియములు
41 జహ, దజహ, జహదజహ లక్షణత్రయము
42 విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృతులు
43 ఆది, మధ్య, అంతములు
44 మంత్ర, లయ, హఠ యోగములు
45 రకార, మకార, దీర్ఘ ములు
46 జీవహంస, కలహంస, అచలహంస
47 హాస్తి, భాతి, ప్రియములు
48 ప్రియ, మోద, ప్రమోద ములు
49 జగజ్జీవేశ్వరులు
50 దృక్ (ఆత్మ) దృశ్య (జగత్తు) ద్రష్ట (జీవుడు)
51 దృగ్దీక్షు, వాగ్దీక్షు, స్పరిశ దీక్షులు
52 హంస, రాజహంస, పరమ హంస
53 బాహ్యభక్తి, అనన్యభక్తి, ఏకాంతభక్తి
54 కర్మ, ఉపాసనా. జ్ఞాన కాండలు
55 శింశుమార, అణ్, విణ్, అంతర చక్రములు
56 ప్రమాతృ (ప్రమాణమైనది) ప్రమాణ (ప్రత్యక్ష, అనుభవ, శబ్ద అనుమానములు) ప్రమేయము (చూపించదగినది)
57 సజాతీయ, విజాతీయ, స్వగతభేదములు
58 అర్చిగ, ధూమ, జ్ఞాన మార్గములు

59 అసంభావన, విపరీతభావన, సంశయభావన

60 శాస్త్రవాసన, లోకవాసన దేహవాసనలు

61 దారేషణ, ధనేషణ, పుత్రేషణలు

62 త్రినేత్రములు

63 త్రిపురములు

64 భూత, భవిష్య, ద్వర్తమానములు

65 తత్పదార్థ, త్వంపదార్థ అసిపదార్థములు

## —* చతుస్సంఖ్య. *—

1 పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరీ చతుర్వాక్కులు

2 ప్రజ్ఞానంబ్రహ్మ, అహం బ్రహ్మాస్మి, తత్త్వమసి, అయమాత్మాబ్రహ్మ, చతుర్మహావాక్యములు

3 ప్రాగ్దక్షిణ పశ్చిమోత్తర చతుర్దిక్కులు

4 ఈశాన, ఆగ్నేయ, నైరుతి, వాయువ్య, చతుర్విదిక్కులు

5 బ్రహ్మవిదుడు, బ్రహ్మవిద్వరుడు, బ్రహ్మవిద్వరిష్టుడు, బ్రహ్మవిద్వరీయుడు, చతుర్విధజ్ఞానులు

6 అంతఃకరణ చతుష్టయము

7 నేత్రిద్వయ, నాసికాద్వయముల, చతుష్పదము

8 జీవేశ్వరవాచ్యార్థ, ప్రత్యక్పరమాత్మ, లక్ష్యార్థములు నాలుగు

9 జరాయుజ, అండజ, స్వేదజ, ఉద్భిజములునాలుగు

10 శ్రవణ, మనన, నిధిద్యాస, సమాధి, నాలుగు

11 స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ, శరీరములు.

12 జాగ్రత్స్వప్నసుషుప్తి, తురీయములు

13 విశ్వ, తైజస, ప్రాజ్ఞ, ప్రత్యగాత్మలు

14 విరాట్, హిరణ్యగర్భ అవ్యాకృత, పరమాత్మలు

15 సాల్లు, బిందు, దీర్ఘ, ప్రత్యక్, సమాధులు

16 సాధన చతుష్టయము

17 చతుర్విధశుశ్రూషలు

18 ఆనంద, చిన్మయ, చిద్రూప, శుద్ధములు నాలుగు ఈశ్వరశరీరములు

19 స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణములు నాలు గు జీవశరీరములు

20 భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్యములు

21 అవిద్యా, విద్యా, ఆనంద, తురీయపాదములు

22 కేసరములు, కర్ణిక, దుద్దు, దుంప, స్థానములునాల్గు

23 నిశీధ, వేసవ, ప్రాత, స్నాయం, సమాధినిష్టా కాలములు

24 ఆజ్ఞేయం, ఘంటిక, దహార, హిరణ్మయకోశ, స్థానములు

25 సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్య పదవులు

26 వాక్, మనో, అక్షి, కాష్ట, మౌనచతుష్టయం

27 సూర్య, చంద్ర, నక్షత్రి, మెరుపు ప్రకాశములు

28 బ్రహ్మజ్ఞానం, దివ్యజ్ఞానం, కాలజ్ఞానం. విజ్ఞానం

29 బాల్య, యవ్వన కౌమార, వార్థిక్యములు

30 బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాస ఆశ్రమములు

31 గాయత్రీ, వేదవ్రిత, వైదిక, నైష్టిక, బ్రహ్మచారులు

32 ముఖ, బాహు, ఊరు పాదములు నాలుగు

33 కుటీచక, బహూదక, హంస, పరమహంస, సన్యాసులు నలుగురు

34 భక్తి, కర్మ, ధ్యాన, జ్ఞానములు నాల్గు

## —* పంచసంఖ్య, *—

1 సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానముఖములయిదు

2 ప్రాక్, దక్షిణ, పశ్చిమ, ఉదక్, ఊర్ధ్వ, సుషిరము లైదు

3 బ్రహ్మ, విష్ణు, రుద్ర, మహేశ్వర॥ సదాశివ పంచకర్తలు

4 ఆది, పరా, ఇచ్ఛా, క్రియా, జ్ఞాన, శక్తులు

5 గౌరీ, లక్ష్మి॥ సరస్వతీ, శచీ, సంజ్ఞా. దేవీ పంచకం

6 గాయత్రి, సావిత్రిః వాగీశ్వరీ. శ్రద్ధా, మేధా, ప్రకృతులు

7 స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ, నిర్మహాకారణ. శరీరములయిదు

8 పృథివి, జలము, అగ్ని, వాయువ, ఆకాశ, భూతములైదు

9 ఓమిత్యేకాక్షరంబ్రహ్మ, ప్రజ్ఞానంబ్రహ్మ, అహం బ్రహ్మాస్మి, తత్త్వమసి, అయమాత్మాబ్రహ్మ, అను పంచమహావాక్యములు

10 సృష్టి, స్థితి, లయ. తిరోధాన, అనుగ్రహ కర్మలైదు

11 సచ్చిదానంద, నిరుపమ, నిర్మల. పంచలక్షణములు ప్రత్యగాత్మవి

12 సత్యజ్ఞానానందాఖండః పరిపూర్ణ, పంచలక్షణములు, పరమాత్మవి

13 జాగ్రత, స్వప్న, సుషుప్తి తుర్య, తురీయాతీతావస్థ లైదు

14 అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ. ఆనందమయకోశము లైదు

15 విశ్వ, తైజస, ప్రాజ్ఞ, ప్రత్యగాత్మ, పరమాత్మ అభిమాను లైదుగురు

16 కైలాస, వైకుంఠ, సత్య, స్వర్గ, సూర్య॥ లోకము లైదు

17 సూర్య, చంద్రి, నక్షత్రి, ధృవ, మెరుపు, మండలములైదు

18 శ్వేత, రక్త. హేమ, నీల, మేఘ, ఛాయల ఇంద్రి ధనస్సు

19 జ్ఞాత, మనో, బుద్ధి, చిత్త, అహంకార. అంతరింద్రియ ములైదు

20 ఆణవ, కార్మిక, మాయిక, మాయేయ, తిరోధాన, మలములయిదు

21 సమాన, వ్యాన, ఉదాన, ప్రాణ, అపాన, పంచప్రాణములు

22 వాక్. పాణి, పాద, పాయూపస్థ. కర్మేంద్రియ ములైదు

23 శబ్ద, స్పరిశ, రూప, రస, గంధ, పంచతన్మాత్రిలు

24 శ్రోత్రము, త్వక్కు, చక్షువ, జిహ్వా. ఘ్రాణము లైదు

25 ఋగ్యజుస్సామాధర్వణ ప్రణవ వేదములైదు

26 అధికార, ప్రయోజన, సాధన, విషమ, సంబంధ, పంచకానుబంధము

27 జాగ్రిత, స్వప్న, సుషుప్తి, అహార, విసర్జన, నిత్యపంచకృత్యములు

28 శ్రోత్ర, నాసిక, జఠర, వాక్కు, గుదస్థానశబ్దము లైదు

29 నబహిఃప్రజ్ఞ, నాంతఃప్రజ్ఞ. నోభయతఃప్రజ్ఞ, నప్రజ్ఞానఘన, నప్రజ్ఞలైదు

30 నర, పశు, పక్షి, మృగ, కీటకజాతులైదు

31 నిరాకారం, ఓంకారం, చిదానందం, పరంజ్యోతి, బ్రహ్మానందం అను నిరాకార, నిర్గుణ విశ్వకర్మ

32 విరాట్, విశ్వరూప, అద్వైత, పరశివ, విశ్వకర్మ, అనుసాకార, సగుణ విశ్వకర్మ

33 వేధ, తృటి, త్రిసరేణువు, అణు, పరమాణువులైదు

34 జీవ, ఈశ్వర, ప్రత్యగాత్మ, పరమాత్మ, పరబ్రహ్మ పంచకం

35 దరిద్రుడు, ధనాఢ్యుడు, కర్మకుడు, భక్తుడు, ముముక్షువు

36 భూతాకాశ, దహరాకాశ, చిదాకాశ, చిత్తాకాశ, శూన్యాకాశములైదు

37 సానగబ్రహ్మఋషి, సనాతనబ్రహ్మఋషి, అహభూనబ్రహ్మఋషి, ప్రత్నబ్రహ్మఋషి, సుపర్ణబ్రహ్మఋషి, అను వైశ్వకర్మలైదుగురు

38 ఉత్క్షేపణ, అవక్షేపణ, అకుంచన, ప్రసారణ, గమనాని, కర్మలైదు

39 శిరో, కంఠ, ఉదర, బాహు, పాద, ముఖ్యాంగములైదు

40 అంతరభూచరీ, ఖేచరీ, షణ్ముఖీ శాంభవీ, మధ్యమ, ముద్రిలయిదు

41 మను, మయ, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞ, పంచ బ్రహ్మలు

42 తారక, దండ, కుండల, అర్ధచంద్ర, బిందు, పంచకము

43 నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయ, ఉపవాయువులైదు

44 వాక్కు, చక్షువు, ఘ్రాణము, శ్రోత్రము, బ్రహ్మరంధములైదు, పంచసుషిరములు

45 యెరుపు, తెలుపు, నలుపు, నీలము, మెరుపు, గల పంచరంగుల నేత్రము

46 ఆధార, స్వాధిష్ఠ, మణిపూరక, అనాహత, విశుద్ధ, పంచపాత్రలు

47 పొల్లు, బిందు, దీర్ఘ, తురీయ, తురీయాతీత, సమాధిపంచకము

48 పూర్వజన్మబంధం, మాతాపితృల బంధం, యోనిసంభవ బంధం, పంచభూతయుక్త బంధం, పునర్జన్మ బంధములైదు

49 పద్మములో దుంపయందున్న, పంచకోణములే బ్రహ్మపీఠము

50 బ్రహ్మబిందు, తేజోబిందు, ధ్యానబిందు, అమృతబిందు, చిద్బిందు; పంచకము

51 అక్షరాభ్యాస గురువు, గాయత్ర్యుపదేశ గురువు, కులగురువు, ఆత్మోపదేశ గురువు, స్వకీయాత్మ గురువులైదుగురు

52 కామాగ్ని, క్రోధాగ్ని, నేత్రాగ్ని, జఠరాగ్ని, జ్ఞానాగ్ని పంచకం

53 బహిఃప్రజ్ఞ, అంతఃప్రజ్ఞ, ఉభయప్రజ్ఞ, అంతరాంతరప్రజ్ఞ, నిర్గుణప్రజ్ఞప్రజ్ఞలైదు

54 మహాకారణమునకు, సద్యోజాతాది పంచబ్రహ్మస్వరూపములే పంచభూతములు

55 మహాకారణమునకు, నివృత్తి, ప్రతిష్టా, విద్యా, శాంతి, శాంత్యతీత, కళారూపములైదే, పంచవిషయములు

56 మహాకారణమునకు, అది, పరా, ఇచ్ఛా, క్రియా, జ్ఞాన, శక్తులైదే, పంచప్రాణములు

57 మహాకారణమునకు, న, మ, శ్శి. వా, య, పంచాక్షరములే, జ్ఞానేంద్రియపంచకం

58 మహాకారణ శరీరమునకు, బ్రహ్మ, విష్ణు, రుద్రేంద్రాదిత్యమూర్తి పంచకమే, అంతరింద్రియములు

59 ప్రత్యక్ష, అనుమాన, ఉపమాన, శాబ్ద, అనుభవ,

ప్రిమాణముల్లైదు

60 దేహేంద్రియాధిష్టాన, దేహగుణాధిష్ఠాన, దేహగుణావరణాధిష్ఠాన, దేహాంతర గుణాధిష్ఠాన, దేహావస్థలాధిష్ఠాన, బుషి పంచీకరణ చక్రిముల్లైదు

61 మరుపు, మరణము, నిద్ర, సమాధి, మూర్ఛల్లైదు అవస్థలు

62 అంగుష్ట, తర్జని, మధ్యమ, అనామిక, కనిష్ఠ వ్రేళ్ళు అయిదు

63 వెలి తెలివి, లో తెలివి, నడి తెలివి, మధ్య తెలివి, నిరుపమ తెలివి, అయిదు

## —* షట్ సంఖ్య. *—

1 అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ, హిరణ్మయ కోశములారు

2 బాహ్య, ఇడా, పింగళ, సుషుమ్నలు, అంతరఇడా, పింగళ, సుషుమ్న లారు నదులు

3 పిండాండ, స్థూల, సూక్ష్మ, కారణ, బ్రహ్మాండ, స్థూల, సూక్ష్మ, కారణ, దేహములారు

4 జ్ఞానేంద్రియ ఆజ్ఞేయము లారును, సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన, గోప్యముఖములారు

5 ఆధార, స్వాధిష్ట, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞేయములే షట్చక్రిములు

6 బ్రహ్మరంధ్రం, గిరిజిహ్వా, వాక్, చక్షున్న, నాసిక, శ్రోత్రములారు బ్రహ్మాండ బిలములు

7 షడూర్ములు, జనన, మరణ, అకలి, దప్పి, శోక, మోహములు

8 జాయతే, అస్తి, వర్ధతే, పరిణమతే, అపక్షీయతే, వినశ్యతి, ఇవిషడ్భావవికారములు

9 కుటీచక, బహూదక, హంస, పరమహంస, అవధూత, దిగంబరయతులాగురుగు

10 బాహ్యదృశ్యానువిద్ధసవికల్పక, బాహ్యశబ్దానువిద్ధసవికల్పక, బాహ్యనిర్వికల్పక, అంతరదృశ్యానువిద్ధసవికల్పక, అంతరశబ్దానువిద్ధసవికల్పక, అంతరనిర్వికల్పక, సమాధులారు

11 ఉపక్రమ, ఉపసంహార అభ్యాస, అపూర్వత, అర్థవాద, ఉపపత్తి,షల్లింగములు

## —* సప్తసంఖ్య. *—

1 ఆధార, స్వాధిష్ఠ, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞేను. సహస్రారములేడు,

2 బ్రహ్మ, విష్ణు, రుద్ర, మహేశ్వర, సదాశివ, గణపతి, సుబ్రహ్మణ్య మూర్తులేడుగురు

3 భూః, భువః సువః, మహః, జనః తపః, సత్యలోకములేడు

4 త్వక్కు, నాళ్లు, రక్తము, మాంసము, మేధస్సు, అస్థి, శుక్లము, అను సప్తధాతువులు

5 మహత్తు, అహంకారం, ఆకాశం, వాయువు, అగ్ని, జలము, పృథివి, సప్తావరణాలు

6 అవిద్య, ఆవరణ, విక్షేప, పరోక్ష, అపరోక్ష, దుఃఖ, నివృత్తి, ఆనందములే సప్తావస్థలు

7 శుద్ధ, ఈశ్వర, జీవ, ప్రమాతృ, ప్రమాణ, ప్రమేయ, ఫల, చైతన్యములేడు

8 సూర్యరథాశ్వములేడు

## —* అష్టసంఖ్య. *—

1 పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశం, అహంకార, మహత్తు, అవ్యక్త, దళములెనిమిది

2 బ్రహ్మ, విష్ణు, రుద్ర, మహేశ్వర, సదాశివ, విశ్వ, తైజస, ప్రాజ్ఞ. అష్టమూర్తులు

3 ఆధార, స్వాధిష్ట, మణిపూరక. అనాహత, విశుద్ధ, ఆజ్ఞేయ, ఘంటిక, అష్టదళ పద్మములెనిమిది

4 జీవతనువులు నాల్గు, ఈశ్వరతనువులు నాల్గు, మొత్తం యెనిమిది శరీరములు

## —* నవసంఖ్య. *—

1 పృథివ్యాద్యష్ట తనువులు- హిరణ్మయతనువు కలసి - నవదేహములు

2 చెవులు. 2, నేత్రములు. 2. ముక్కు రంధ్రములు. నోరు 1. ఉపజిహ్వ .1 బ్రహ్మరంధ్రం 1. మొత్తం బ్రహ్మాండ నవరంధ్రములు

3 మంత్ర. లయ. హఠ. సాంఖ్య. తారక. అమనస్క. రాజ. హంస, ధ్యానయోగములు తొమ్మిది

4 షట్చక్ర. ఘంటికా. శింశుమార. సహస్రార. నవచక్రములు

5 మరీచి. అత్రి. అంగీరస. పులస్త్య. పులహ పౌలస్త్య కస్యప. దక్షక. గస్గురు, నవబ్రహ్మలు

6 ఆచార. గురు. చర. ప్రసాద, శివ. మహా. ప్రాణ. భావ. ఇష్ట లింగములు తొమ్మిది.

## ౪౫ త్రివాదములు.

1 ఆరంభ వాదమనగా=నూలు వస్త్రమైనది. నూలు రూపము మారలేదు.

2 పరిణామ వాదమనగా = కారణమైన పాలుమారి పెరుగైనది.

3 వివర్త వాదమనగా = త్రాడునందు పాము అనే భ్రాంతి గలుగుట.

1 జగత్తునకు బ్రహ్మము, ఆరంభోపాదనమయ్యేనేని, ఘటమునకు, కులాల, దండ, చక్రాదులు, కారణాంతరమైనట్లు కాలేదు గనుక, కారణ రహిత బ్రహ్మమునకు, కారణము గావలసి వచ్చును, శ్రుతి విరుద్ధము గనుక, ఈ ఆరంభవాద మంగీకరించబడదు.

2 జగత్తునకు బ్రహ్మము, పరిణామోపాదాన మయ్యేనేని। పాలు పెరుగైనట్లు। నిర్వికారుడవుటచే స్వస్వరూపము మారనందున పరిణామ వాదమంగీకరించ బడదు.

3 జగత్తునకు బ్రహ్మము। వివర్తోపాదానమే యగును త్రాటియందు సర్పము తోచినట్లు। పరబ్రహ్మమందు। అజ్ఞాన భ్రాంతిచే జగత్తు తోచినందున। వివర్తవాద మంగీకరించ దగినది.

## ౪౬ షడుపాదానములు.

1 ఆవర్తోపాదనం॥ దధిక్షీర న్యాయం = పాలుచెడి పెరుగు అయినట్లు.

2 సంవర్తోపాదానం॥ పాచితీగెవత్ = అంతర తామరవత్ = మూలం లేదు.

3 అణుపాదానం॥ మూలం లేక బుట్టి। పెరిగి। నశించు మెరుక॥

4 సన్యస్తోపాదానం॥ స్వప్నమువలె తోచి। వృద్ధిపొంది లేకపోవడము॥ తక్షణం జలబుద్బుదములవత్॥ మెరుపువత్.

5 అణుపాదో పాదానం॥ స్వర్ణభూషణవత్ = తంతుపట వత్ - అన్ని మెరుకే,

6 అజాతో పాదానం॥ ఖపుష్పవత్ = వంధ్యాపుత్ర వత్ = నరశృంగవత్.

## ౪౭ అష్టకారణములు.

1 సమవాయికారణం॥ ఘటమును గూర్చి, కపాల మున్ను॥ మృత్తున్ను.

2 అసమవాయికారణం॥ పటమునుగూర్చి తంతువున్ను॥ తంతుద్వయ సంయోగం.

3 నిమిత్తకారణం॥ చక్ర, దండ. కుల దాసభాదులు॥ ఘటమునుగూర్చి.

4 సంయోగకారణం॥ ఘటపట సంయోగము.

5 అనుబంధకారణం॥ గోమయుకీటకవత్ = సూర్యాగ్ని సూర్యకాంతమునగలిగె.

6 స్వకారణం॥ విత్తునుచెట్టు, చెట్టునువిత్తు, బుద్ధినిమిత్త కారణం. దేహము ఉపాదాన కారణం. స్వకీయంగా, కార్యకార ణములగుట.

7 స్వపాధికారణం॥ ప్రారబ్ధము అన్నిటికి.

8 నిరుపాధికారణం॥ పరమాణువు.

## ౪౮ అ ష్ట భా వ ము లు.

1 ప్రాగ్భావం॥ పూర్వములేనిది, ఎరుకఅంటే. వుత్తర మందు వున్నదని అర్థంవచ్చును.

2 ప్రధ్వంసాభావం॥ త్రికాలములయందు. విచారిస్తే లేదుగనుక, అది లేనట్టే.

3 అత్యంతాభావం॥ ఇప్పుడు లేకపోవడం కాదుగనుక. అత్యంతాభావమున్నకాదు.

4 అన్యోన్యాభావం॥ ఎరుకపూర్ణము. పూర్ణముఎరుక. కాలేదుగనుక. అన్యోన్యాభావము లేదు,

5 వ్యాహృదాభాసం॥ ఘటాకాశ. పటాకాశవత్. విచారించగా భేదముండుటచే, అదికాదు.

6 ప్రాహృదాభానం॥ దారువందగ్నివలె కాదుగనుక పూర్ణము. ప్రాహృదాభావముకాదు.

7 సమవర్తకాభావం॥ రెంటిసంయోగముచేత వచ్చినది పూర్ణంకాదుగనుక. సమవర్తకాభావం లేదు.

8 సామాన్యాభావం॥ సూర్యునికి సూర్యకాంతమునకు ఇచ్ఛలేక అగ్నికలిగినట్లు. పుట్టలేదుగాన. అదికాదు.

# ౪౯ ద్వంద్వభావములు.

1 జన్యము = జనకము॥ జన్యమనగా పుట్టినది. జనక భావమనగా కన్నది.

2 ధర్మి = ధర్మము॥ ధర్మిఅనగా ముఖము॥ ఉదాహరణము పుష్పము॥ ధర్మముఅనగా. పుష్పమందలి పరిమళము,

3 ఉపమానము = ముఖము॥ ఉపమేయము = చంద్రుడు.

4 స్వాభావికము = తెలుపు॥ ఆగంతుకము = రంగు.

5 విశేషణం = రంగు॥ విశేష్యము = కమలం॥ నీలఘుటమనినట్లు.

6 దృష్టాంతము = సూర్యకిరణములు చంద్ర చంద్రికలు॥ ద్రాష్టాంతము = ప్రజ్ఞాన చిచ్ఛక్తులు॥ బిందుప్రకాశములు.

7 గుణి = ఇంద్రియములు॥ గుణము = సంకల్పవికల్పాదులు.

8 దేహి = ఆత్మ॥ దేహము = తాపత్రయాగ్నులచే దహింపబడునది.

9 అధ్యారోపము = త్రాడుయందు సర్పము. ముచ్చిప చిప్పయందు వెండి॥ ఎండమావులయందు జలము॥ మొద్దునందు పురుషుడుతోచుట॥ అపవాదము = మట్టివలన బుట్టినకుండలు మూకుళ్ళు, ముంతలు॥ బంగారమువలనబుట్టిన. కంటెలు. ఉంగరములు వగైరా ఆభరణములు॥ మృత్తు, స్వర్ణములకెట్లు వేరు

గాలేవో అటులనే ఆత్మవలనగలిగిన ప్రపంచము॥ ఆత్మకంటె వేరుగాలేదని తెలియుట.

10 విషయి. విషయము = శబ్దస్పర్శాది విషయములు గలది విషయి.

11 అన్యాపదేశము = భ్రమణములేని సూర్యునికి. ఉదయాస్తమయములు గలవనుట॥ చలించనిఆత్మయందు. జాగ్రత్స్వప్నసుషుప్తులుగలవన్నటుల. ఒకదానికున్న విషయములు. మరయొకదానియందు కల్పించుట.

## ౫౦ వేదోపనిషదాదిప్రమాణములు.

### తైత్తిరీయోపనిషత్=శిక్షావల్లి

1 మూలం॥ సయఏషోఽన్తర్హృదయ ఆకాశః।తస్మిన్నయం పురుషోమనోమయః అమృతో హిరణ్మయః।అన్తరేణతాలుకే। యఏషస్తన ఇవావలంబతే। సేన్ద్రయోనిః యత్రాసౌ కేశాన్తో వివర్తతే। వ్యపోహ్యశీర్షకపాలే। భూరిత్యగ్నౌప్రతితిష్ఠతి॥

టీక॥ అన్తఃహృదయే = హృదయపుండరీక మధ్యభాగమునందు। యః = ఏ। ఏషః = ఈ। ఆకాశః = ఆకాశముగలదో। తస్మిన్ = ఆయాకాశమునందు। మనోమయః=మనోమయుడును అమృతః=మరణధర్మరహితుడును। హిరణ్మయః = స్వర్ణ జ్యోతిర్మయుడును అగు। సఃఅయం = ఆఈ। పురుషః = పురుషుడు। (కలడు) తాలుకేఅన్తరేణ=తాలువులకుమధ్య భాగమునందు। యః=ఏ। ఏషః=ఈ। (అంతరసుషుమ్నానాడి) స్తనఇవ=స్తనమువలె। అవలంబతే = వ్రేలాడుచున్నదో। యత్ర = ఎచ్చట।

అస్యా=ఈ । కేశాంతః=కేశములయొక్క మొదలు । వివర్తతే= విభాగముగానున్నదో । శీర్షకపాలే = శిరఃకపాలములను । వ్యపోహ్య = విభజించి బయలువెడలినది యెయ్యదిగలదో । సా=అది। ఇంద్రియోనిః = పరమాత్మను బొందుటను మార్గభూతము। (ఈప్రకారము పరమాత్మ ప్రతిపత్తిమార్గమును పొందిన అనుభవవిద్వాంసుడు) భూఃఇతిఅగ్నౌ =భూఃఅను వ్యాహృతాత్మకమగు అగ్నియందు । ప్రతితిష్ఠతి = ఉంటున్నాడు॥

2 యజుర్వేదము॥ విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో । విశ్వతోహస్త ఉతవిశ్వతస్పాత్ । సంబాహుభ్యాంనమతి సంప్రతత్రైర్ద్యావా పృధివీజనయన్ దేవఏకః॥ తా॥ సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన, దిశలు అంతట నేత్రములు, ముఖములు, హస్తములు, పాదములు, బాహువులుగల దేవుడొక్కడే, భూలోక, స్వర్గలోకములు పుట్టించెను.

3 మైత్రేయోపనిషత్॥ శిలా, దారు, మణిమయ, మృణ్మయ, విగ్రహేషు, పూజా పునర్భోగ కరీ ముముక్షోః। తస్మాద్యతిః స్వహృదయార్చనమేవ, బాహ్యార్చనం పరిహరేద పునర్భవాయ॥ తా॥ ముముక్షువునకు, శిలా, దారు, మణి, మృణ్మయ, విగ్రహములయందు పూజించుట, తిరిగి, భోగములనుభవించగలడు॥ ఆకారణమువలన, యతీంద్రులు, తనయొక్క హృదయమందే, అర్చన చేయవలయుచు, బాహ్యార్చన పరిహరించుటవలన, తిరిగి పుట్టడు.

4 మంత్రపుష్పము = తిర్యగూర్ధ్వమ ధశ్శాయీ॥ తా॥ అడ్డము, క్రిందికి, పైకి ఆత్మ శయనించియున్నది.

5 పురుషసూక్తము = అత్యతిష్ఠ ద్దశాంగులమ్॥ తా॥ పది అంగుళములలో ఆత్మగలదు॥ భూతోపలక్షకః

6 సంధ్యావందనం = అసావాదిత్యోబ్రహ్మ॥ తా॥ ఈ సూర్యుడే బ్రహ్మము.

7 యోగకుండల్యుపనిషత్॥ దహరస్థః ప్రత్యగాత్మా॥ తా॥ దహరావకాశములో ప్రత్యగాత్మయున్నది.

8 సంధ్యావందనం = ఓమిత్యేకాక్షరం బ్రహ్మ॥ తా॥ ఏకమైన ఓంకారబ్రహ్మము నశించనిది॥ ప్రణవమహావాక్యమిది

9 మంత్రపుష్పం = పద్మకోశ ప్రతీకాశగ్ం। హృదయం చాప్యధోముఖం। అధోనిష్ట్యా వితస్త్యాంతే। నాభ్యాము పరితిష్ఠతి॥ తా॥ అష్టదళ పద్మమందలి షట్కోశవ్యతిరిక్తాత్మ ప్రకాశము హృదయమువరకు. అధోముఖముగా వ్యాపించి, నాభికి పైభాగమున యున్నది.

10 శరభోపనిషత్ = అంగుష్ఠమాత్రః పురుషోంతరాత్మా॥ అంగుష్ఠమాత్రముగల అంతరాత్మ పురుషుడుగలడు.

11 ధ్యానబిందూపనిషత్॥ హృదిస్థానే అష్టదళపద్మం వర్తతే। తన్మధ్యే రేఖావలయం కృత్వా, జీవాత్మరూప మణుమాత్రం వర్తతే॥ తా॥ సమస్త వృత్తులు హరింపజేయు బ్రహ్మ హృదిస్థానమందు, అష్టదళపద్మము వర్తించుచున్నది ఆపద్మ మధ్యయందు, గుండ్రని జీవాత్మ, అణుమాత్రముగా వర్తించుచున్నది.

12 మంత్రపుష్పము॥ నీలతోయద మధ్యస్థ, విద్యుల్లేఖేవ భాస్వరా, నీవారశూక వత్తన్వీ, పీతాభాస్వత్యణూపమా, తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః॥ తా॥ మేఘములమధ్యయున్న మెరుపుతీగెవలె ప్రకాశించుచున్నట్టియు, నివ్వరిధాన్యము యొక్క ముల్లువలె శరీరము గలిగినట్టియు, పచ్చగా ప్రకాశించుచున్నట్టియు, అణువుతో నుపమానమైనట్టి, ఆహిరణ్మయ శరీరముయొక్క శిఖామధ్యయందు పరమాత్మ ఉంచున్నది.

13 కఠోపనిషత్॥ అణోరణీయాన్ మహతో మహీయాన్॥ తా॥ అణువులో అణువుగాను మహత్తులో మహత్తుగాను బ్రహ్మము ప్రకాశించుచుండెను.

14 ముండకోపనిషత్॥ హిరణ్మయ పరేకోశే॥ తా॥ బంగారు వర్ణముగల పరకోశమందాత్మగలదు.

15 మండల బ్రాహ్మణోపనిషత్॥ సహస్రారేజల జ్యోతిః॥ తా॥ ఆగామి, సంచిత, ప్రారబ్ధ, త్రయకర్మనీములోపల సహస్రారకమలమందు ఆత్మజ్యోతి ప్రకాశించుచుండెను॥ ఇదే దేవశిఖాచక్రము, ఇదే ఆపోజ్యోతి.

16 అద్వైతారకోపనిషత్॥ పిండాండశిరో మధ్యస్థాకాశే॥ తా॥ పిండాండముయొక్క శిరోమధ్యనున్న ఆకాశమందు పరమాత్మగలదు.

17 సౌభాగ్యలక్ష్మ్యుపనిషత్॥ ఘంటికా లింగమూల చక్రాంతే॥ తా॥ ఘంటికా చిహ్నముగల మూలచక్రముయొక్క లోపల ప్రదేశమందు బ్రహ్మము వెలుగుచు.

18 శాండిల్యోపనిషత్॥ తాలుమూలగతాం యత్నాజ్జిహ్వాయాక్రమ్య ఘంటికా। ఊర్ధ్వరంధ్రేగతే ప్రాణే పానస్పందోనిరుధ్యతే॥ తా॥ తాలువులకు మూలమందు పొందబడినటువంటి, జిహ్వను ఆక్రమించినటువంటి, ఘంటికా చిహ్నముగల, ఊర్ధ్వరంధ్రమందు పొందబడిన, ప్రాణవాయువు అపానవాయువు ప్రయత్నమువలన, దట్టముగా. అరికట్టబడుచున్నది.

19 త్రిశిఖబ్రాహ్మణోపనిషత్॥ తుర్యాతీతం పరం బ్రహ్మ బ్రహ్మరంధ్రేతు లక్షయేత్॥ తా॥ బ్రహ్మరంధ్రమందు తురీయాతీతమైన, పరబ్రహ్మము లక్షించతగినది

20 ధ్యానబిందూపనిషత్॥ బీజాక్షరం పరంబిందుం। నాదం తస్యోపరిస్థితం। సశబ్దం చాక్షరేక్షీణే, నిశ్శబ్దం పరమం పదం॥ తా॥ నాదసహితమైన పరబిందువు బీజాక్షరము. దాని లోవున్నటువంటి ఆ శబ్దము క్షీణించినపుడు, శబ్దరహితమైన పరమపదము (పరిపూర్ణము) నశించనిది.

21 తేజోబిందూపనిషత్॥ తేజోబిందుపరం ధ్యానం। విశ్వాత్మహృది సంస్థితం॥ తా॥ హృత్పుండరీకమందున్నటువంటి పరమైన తేజోబిందువు, సమస్త ఆత్మలయందు ధ్యానించదగినది.

22 వరాహోపనిషత్॥ హ్రస్వంబిందు గతం దైర్ఘ్యం బ్రహ్మరంధ్రగతం ప్లుతం॥ తా॥ బ్రహ్మరంధ్రమును పొందిన బిందువు, పొట్టిగాను అతిదీర్ఘముగా నుండుటగలదు.

23 యోగకుండల్యుపనిషత్॥ బిందుమధ్యేచ జీవాత్మా సూక్ష్మరూపేణవర్తతే॥ తా॥ బిందుమధ్యయందు జీవాత్మ సూక్ష్మరూపముగా వర్తించుచున్నది.

24 యోగతత్వోపనిషత్ ॥ ఊర్ధ్వనాళమధోబిందు స్తస్య మధ్యేస్థితంమనః॥ ఊర్ధ్వనాళమున బిందువున్నది, దానియొక్క మధ్యయందు అధోమనస్సు ఉన్నది.

25 బ్రహ్మబిదూపనిషత్॥ తదేవనిష్కళంబ్రహ్మ। నిర్వికల్ప నిరంజనం। తద్బ్రహ్మాహ మితిజ్ఞాత్వా। బ్రహ్మసంపద్యతేధృవం॥ తా॥ ఆబిందువే కళంకరహితమైన బ్రహ్మము, వికల్పములేనిది, నిరంజనమైనది, ఆ బ్రహ్మబిందువును తెలుసుకొనినవాడు, బ్రహ్మసంపత్తు బొందగలడు నిశ్చయము.

26 మంత్రపుష్పము॥ సబ్రహ్మ, సశివ, స్సహరి, స్సేంద్రసోఽక్షరః పరమస్వరాట్॥ తా॥ స్వయంప్రభువైన పరమాత్మ, బ్రహ్మ, విష్ణు, రుద్రేంద్రాదిత్య పంచమూర్త్యాత్మకమైనది

27 శ్వేతాశ్వతరోపనిషత్॥ ౪ అధ్యాయం=ఏషదేవో విశ్వకర్మా మహాత్మా, సదాజనానాం హృదయే సన్నివిషః॥ తా॥ యెల్లప్పుడు జనులయొక్క హృదయమందు, ఈమహాత్ముడైన విశ్వకర్మదేవుడు కూడుకొనియుండెను.

28 యజుర్వేదం॥ 3 కాండ॥ ౮ అను॥ పంచవైశ్వకర్మణహోను సూక్తం॥ ఓం నమో విశ్వకర్మణే సఉపాత్వస్మాన్॥ తా॥ అష్టాక్షరీమంత్రముగల విశ్వకర్మకొరకు నమస్కరించుచున్నాను. ఆ విశ్వకర్మ మమ్ములను రక్షించుగాక.

29 యజుర్వేద, నమకం=నమశ్శివాయ॥ తా॥ శివుని కొరకు నమస్కరించుచున్నాను.

30 ఐతరేయోపనిషత్ ॥ ప్రజ్ఞానం బ్రహ్మ॥ తా॥ విస్తారమైన ప్రజ్ఞానమే బ్రహ్మము॥ అధికార, సాక్షాత్కార, మహావాక్యము.

31 బృహదారణ్యకోపనిషత్॥ అహం బ్రహ్మాస్మి॥ తా॥ నేను బ్రహ్మము అయితిని॥ శిష్య, అనుభవ, మహా వాక్యము.

32 ఛాందోగ్యోపనిషత్॥ తత్త్వమసి॥ తా॥ అది నీవు అయితివి, నీవు అది అయితివి, అది నీవుఅయితివి॥ గురు, ఉపదేశ, మహావాక్యము.

33 మాండూక్యోపనిషత్॥ అయమాత్మా బ్రహ్మ॥ తా॥ ప్రత్యక్షమగు ఈఆత్మేబ్రహ్మము! లక్షణ, సమాప్తి, మహావాక్యము.

34 బ్రహ్మసూత్రము॥ ప్రాదేశమాత్ర శరీరం ధృత్వా॥ తా॥ ఆబ్రహ్మము, జబ్బెడుమాత్రముగల శరీరము ధరించెను,

35 పాతంజలియోగశాస్త్రం॥ విభూతిపాదము॥ మూర్ధజ్యోతిషి సిద్ధదర్శనమ్॥ తా॥ మూర్ధ్నియందలి ఆత్మ జ్యోతియందు, సిద్ధపురుషుని దర్శనమగును.

36 హంస శివస్సోహం॥ తా॥ ఆ శివరూపమైన హంసయే నేను,

37 సోహం॥ తా॥ ఆ అచలాద్వైత పరిపూర్ణ పర బ్రహ్మమే నేను. సకారమందలి ఓకారము, హకారమందలి బిందువుగల ఓంకారమంను, హకార ఈశ్వరుడు, సకార జీవు డునైక్యమైరి.

38 శ్లో॥ అష్టాక్షరేశాష్టదళైచ పద్మం। భూరేఖమధ్యాంతర చక్రవర్తి। అనంతకోటిప్రభ సూర్యరూపం। ధ్యాయే శివం శాంతమఖండతేజం॥ తా॥ యజుర్వేదోక్త, ఓం నమో విశ్వకర్మణేత్యష్టాక్షరములుగల అష్టదళ పద్మము గలిగినట్టియు, గంధ గ్రాహకమైన భూరేఖకు మధ్య అంతరచక్రవర్తియైనట్టియు, అంతులేని కోటికాంతులుగల సూర్యరూపుడైనట్టియు. మంగళప్రదమైనట్టియు, శాంతమైనట్టి, అఖండ తేజస్సును ధ్యానించుచున్నాను.

39 శ్లో॥ పంచాంగుళాంతరాత్మానం। బిందురూపేణ వర్తినం। జీవబ్రహ్మైక్య సిద్ధ్యర్థం। లక్ష్యం సంధానకుర్మహే॥ తా॥ బిందురూపముతో వర్తించుచున్నటువంటి, పంచాంగుళములకు అంతరమందున్న ఆత్మనుగూర్చి, జీవబ్రహ్మైక్య సిద్ధి కొరకు లక్ష్యమును సంధింప జేయుచున్నాను.

40 పద్యం॥ ఉపజిహ్వకు ప్రాగ్దిక్కున। త్రిపుటికి మధ్యంబునందు। దీపముతానై। జపియించు రామమంత్రము, తపసిని గనుగొన్నవాడు। ధన్యుడు తరుణీ॥ తా॥ సమీపజిహ్వకు తూర్పుదిక్కున, త్ర్యగూర్ధ్వాధల మూటికి మధ్యప్రదేశమందు, ప్రకాశించు దీపము తానయి రామ తారకమంత్రము జపియించు హంసరూపుని తెలుసుకున్నవాడు, ధన్యుడని శివుడు పార్వతికి జెప్పెను.

—* పూర్ణ ప్రమాణములు, *—

41 మాండూక్యోపనిషత్॥ నాన్తః ప్రజ్ఞం, నబహిః ప్రజ్ఞం। నోభయతః ప్రజ్ఞం। నప్రజ్ఞానఘనం। నప్రజ్ఞం। నాప్రజ్ఞం। అదృశ్యమవ్యవహార్యమగ్రాహ్య మలక్షణమచింత్య మవ్యపదేశ్య

మేకాత్మ ప్రత్యయసారం, ప్రపంచోపశాంతం । శివమద్వైతం।
చతుర్థమన్యంతే । సఆత్మా, సవిజ్ఞేయం॥ తా॥ లోతెలివి,
వెలితెలివి, ద్వివిధతెలివి, గొప్పతెలివి, తెలివిడున్న, తెలివిలే
నటువంటి, కనబడని, వ్యవహారంలేని, గ్రహించదగని, పంచ
లక్షణములులేని, చింతించ శక్యముగాని, యేస్థానములేని, ఏక
మైన యేప్రత్యగాత్మసారము, ప్రపంచోపశాంతము, మంగళప్ర
దమైన, ద్వి[illegible]ములు లేని ఏకమైన తురీయమునకు వేరుఅయిన
ఆ ఆత్మయే [illegible]తెలియబడునది.

42 [illegible]గోప్యుపనిషత్॥ ఓం పూర్ణమిదః, పూర్ణమి
దం పూ[illegible] [illegible]ర్ణాంపుదశ్చతే, పూర్ణశ్చ పూర్ణమాదాయ,
పూర్ణమే[illegible] [illegible]వ్యతే॥ తా॥ అంతట నిండింపబడిన ఈ పరి.
పూర్ణమే[illegible] [illegible]బడునది.

[illegible] [illegible]ప్రు॥ యత్రనాన్యత్ పశ్యతి । నాన్యచ్ఛృణోతి।
నాన్య[illegible] [illegible] । సభూమఇతి॥ తా॥ యెచ్చటను యేమిచూ
చుటలే[illegible] [illegible]యేమి వినుటలేదో, రెండుగా తెలియుటలేదో,
అదియే [illegible]ర్ణము.

4[illegible] [illegible]గవద్గీత॥ శ్లో॥ నైనంఛిందంతి శస్త్రాణి, నైనం
దహతి పా[illegible]ః । నచైనంక్లేదయంత్యాపో । నశోషయతిమారుతః।
అచ్ఛేద్యోయమదాహ్యోయ । మక్లేద్యో శోష్యఏవచ నిత్యసర్వ
గతస్థాణు । రచలోయం సనాతనః॥ తా॥ అనంతకోటి బ్రహ్మాం
డములయందు । లోపలవెలుపల, యేది పరిపూర్ణమై యుండి,
అదృశ్యమై, అగ్రాహ్యమై, నిరావరణమై, అప్రమేయమై,
అబాధ్యమై యున్నదో, జ్ఞానాజ్ఞానములకు, చిదచిత్తు మొద

త్రైన, ద్వంద్వములకు భిన్నమై సదా ఏకరూపముగానున్నదో, అది నిర్వికార, అచల, పరిపూర్ణ పరబ్రహ్మమని చెప్పబడినది.

45 త్రిపాద్విభూతి మహానారాయణోపనిషత్ ॥ మోక్షసామ్రాజ్య పట్టాభిషేకోత్సవమ్ ॥ మూలం ॥ మోక్ష సామ్రాజ్య పట్టాభిషేకముద్దిశ్య । మంత్రపూతై రుపాసకమానన స్సకల శైరభిషిచ్య । దివ్యమంగళ మహావాద్యపురస్సరం । వివిధోపచారై రభ్యర్చ్య । మూర్తిమద్భిస్సర్వై స్స్వ చిహ్నై రలం కృత్య । ప్రదక్షిణ నమస్కారాన్విధాయ ॥ త్వంబ్రహ్మాసి । అహం బ్రహ్మాస్మి । అనయోర న్తరం నవిద్యతే । త్వమేవాహం । అహమేవత్వం । ఇత్యభి ధాయేత్యుక్త్వాఽది నారాయణ స్థిరో దధేత ధేత్యుపనిషత్ .

తా॥ మోక్ష సామ్రాజ్య పట్టాభిషేకము శిష్యునకు చేయనుద్దేశించి । ఓం స్సామ్రాజ్యే నాభిషించా మీంద్రస్య బృహస్పతే స్త్వా సామ్రాజ్యే నాభిషించామి॥ ఓం శాంతిశ్శాంతి శ్శాంతి. ఇతి పవిత్రమంత్రము నుపాసించి । ఆనన్ద కలశము లతో అభిషేకముచేసి । దివ్యమంగళ వాద్యపూర్వకముగా, వివిధమైన ఉపచార పూజలుచేసి । మూర్తివంతమైన సర్వ చిహ్నములచేత అలంకరించి । ప్రదక్షిణపూర్వక నమస్కార ములుచేసి, త్వంబ్రహ్మాసియని గురువు । అహంబ్రహ్మాస్మి యని శిష్యుడు । అనయోర న్తరం నవిద్యతేయని ఉభయు లున్న । త్వమేవాహం । అహమేవత్వం । నీవే నేను, నేనే నీవు । అని యిట్లు నమస్కరించి స్థిరమైన ఆదినారాయణుడవు అవుదువని పలుకవలయును.

46 గుర్వాఽరాధన = నారద పరివ్రాజకోపనిషత్ - ప్రణవ మహావాక్యోపదేశం ప్రాప్య। పితృ మాతృ గుర్వాఽరాధన పరః॥

తా॥ స్త్రీపురుషులందరు ప్రణవ మహావాక్యోపదేశము బొంది పితృ, మాతృ, గుర్వాఽరాధనలు జేయవలయును.

## ౪౭ గురుపరంపరాహారతి.

(1) నీవార శూకవర్తికి । నిష్కళంకా మంగళం ॥నీవార॥
(2) దివ్య గురుపరంపర । దేశికవర్యులాకు ॥నీవార॥
(3) శ్రీధరస్వామి దేశిక । బ్రహ్మణ్యులానుజయ ॥నీవార॥
(4) రాంమదుగు శివరామ । రాజిత దీక్షితులకు ॥నీవార॥
(5) కంబలూరి అప్పరావు । కల్మష రహితునకు ॥నీవార॥
(6) పరిశ చెన్నయార్య శుద్ధ । పరదేశికేంద్రునకు ॥నీవార॥
(7) మల్లిపెద్ది కృష్ణబ్రహ్మయ । మహాత్మ శీలునకు ॥నీవార॥
(8) శుభకర్ణశింగు ప్రభువు । సుప్రసిద్ధ తీర్థులకును ॥నీవార॥
(9) కంచి రామానందస్వామి । కమలాంతరాత్మునకు ॥నీవా॥
(10) తూములూరి రామశాస్త్రి । విమలాత్మగురుస్వామికి ॥నీ॥
(11) శ్రీమదుపు సుబ్బయాచార్య । సిద్ధేంద్ర దేశికునకు ॥నీ॥

శ్రీ మన్నదుపు సుబ్బయాచార్య దేశికేంద్రులవారి
—* సోదరాధికారుల హారతి *—

(1) చందవరపు హనుమంత । యతిచంద్రులాధికారికి ॥నీవార॥
(2) తత్పత్ని ఆదిలక్ష్మి । సాధ్వీమణిఅధికారికి ॥నీవార॥

## శ్రీ మన్మదుపు సుబ్బయాచార్య దేశికేంద్రులవారి
## —* శిష్యాధికారుల హారతి *—

(1) పీఠాధికారమొసగిన । ప్రియసుబ్బయ్యావధూతకు ॥నీ॥
(2) శ్రీమన్మదుపు సుబ్బయాచార్య । శిష్యాధికారులకును॥నీ॥
(3) కారుణ్యరాజాలక్ష్మి । నారాయణాధికారికి ॥నీవార॥
(4) వరలంకలపల్లె అప్పల । స్వామి అధికారికిని ॥నీవార॥
(5) భద్రమైనట్టివెల్ల । రుద్రయ్యాఖ్యాధికారికి ॥నీవార॥
(6) సత్పానుగంటి కోటి । శ్వరశాస్త్రి అధికారికి ॥నీవార॥
(7) అమలగోలి సుబ్బరాయ । ఆచార్య అధికారికి ॥నీవార॥
(8) వైరాగ్య కొల్లి కోటయ్య । సర్వాధికారికిని ॥నీవార॥
(9) సాధుయతి చిదానంద । స్వామి అధికారికిని ॥నీవార॥
(10) రాజిత గిరిరాజు మహా । లక్ష్మమ్మాధికారికి ॥నీవార॥
(11) విమలమూర్తి గురుదుర్గాశి । వెంకయ్యాధికారికి ॥నీవా॥
(12) దివ్యాంగలకుదిటి షణ్ముఖ । దీక్షితులాధికారికి ॥నీవార॥
(13) పరమ కోలవెన్ను పర । బ్రహ్మ తీర్థాధికారికి ॥నీవార॥
(14) పుణ్యమైనట్టి నెక్కల । పున్నమ్మాధికారికి ॥నీవార॥
(15) వారణాశి ఆంజనేయ । తీర్థాధికారికిని ॥నీవార॥

## శ్రీ మన్మదుపు సుబ్బయాచార్య దేశికేంద్రులవారి
## —* ప్రశిష్యాధికారుల హారతి *—

(1) నూజెల్ల నరసయార్య । పూజ్యాధికారికిని ॥నీవార॥
(2) మాన్యబోధగల బెవర । మాణిక్యార్యాధికారికి ॥నీవార॥
(3) కొసనం వంశ వీరయార్య।గుర్వాఽధికారికిని ॥నీవార ॥నీ॥
(4) బ్రహ్మనాదిని యలమర్తి(శ్రీ) శేషమ్మాధికారికి ॥నీవార॥
తేటప్రోలు పురభక్తులు । దీప్తిగల హారతినిచ్చిరి ॥నీవార॥

# ౫౨ గ్రంథపూర్తి.

శ్లో॥ అద్వైతానుభవఃకోశః । శరేషు బిందురింద్రియం ।
బ్రహ్మజ్ఞానోపయోగార్థం । కలికాలే ప్రపూరితం ॥

# ౫౩ గద్య.

శ్రీ మద్విరాడ్విశ్వకర్మోర్ధ్వ ముఖసంజనితులు, సుపర్ణ సగోత్రోద్భవులు, ప్రణవ శాఖాన్వితులు, విశ్వజ్ఞ సూత్రులు॥ ఉపసుపర్ణ. విశ్వజ్ఞ. పరిత, సూరసేన, సాంఖ్యాయన, పంచార్షేయ ప్రవరాన్వితులు॥ శ్రీకృష్ణానదీతీరోత్తర, తేలప్రోలు నివాసులు, శ్రీమదంగలకుదిటి వంశసంభూతులు, అయిన॥ శ్రీ భ్రమరాంబ, సాల్వపతులకు, ప్రపౌత్రుడు॥ శ్రీ భ్రమరాంబ, మల్లయ్య, శాస్త్రులకు పౌత్రుడు॥ శ్రీ దుర్గాంబ వీర మల్లయ్యలకు, తృతీయపుత్రుడు॥ విశ్వనాధాచార్య, మల్లికార్జునాచార్యులకు, కనిష్ఠసోదరుడు॥ శ్రీ కనకదుర్గాంబకు పతియు॥ బసవాచార్యులకు జనకుడు॥ బ్రహ్మశ్రీ ఎఱ్ఱోజు శోభనాద్రాచార్యశ్రోత్రులవలన, మనుసూత్రాధీతియు॥ శ్రీ సాహిత్య సింహాపండిత, తపశ్చక్రవర్తి, భాష్యకారాచార్య, యలవర్తి ఆంజనేయశాస్త్రి॥ మహామహోపాధ్యాయ వైద్యరత్న శ్రీ

చివుకుల సత్యనారాయణశాస్త్రి, ద్వయమువలన సంస్కృతాధీతియు॥ శ్రీధరస్వామి గురుపరంపరులు, శ్రీమత్స్వాములూరి రామశాస్త్రిదత్త, గురుపట్టాధికారులు, గుంటూరుపట్టణ నివాసులు, వేదాంతపీఠ స్థాపనాచార్యులు, అగ్రికుల విశ్వబ్రాహ్మణ సంజనితులు, సువర్ణసగోత్రోద్భవులు, శ్రీమదఖండ సచ్చిదానంద నిరుపమ, నిర్మలోపాధి ద్వయదోష రహితాచల పరిపూర్ణ, పరబ్రహ్మ స్వరూపులునగు। శ్రీమన్మదుపు సుబ్బయాచార్యావధూత స్వాములవారివలన, సూచన, కారణోపదేశ అంతరావధూత, గురు పట్టాభిషిక్తుడై నటువంటి॥ సాహిత్య భూషణ, బ్రహ్మాద్వైత దేశికేంద్ర, పంచాగ్నిహోత షణ్ముఖస్వపతిచే॥ అద్వైతానుభవము రచియింపబడినది.

అద్వైతానుభవము సమాప్తి.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



# తప్పొప్పుల పట్టిక.

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 8 | బోధిన | బోధినం |
| 10 | 10 | శుద్గ | శుద్ధ |
| 10 | 22 | ఉన్తశ్య | ఉ ప్తస్య |
| 11 | 8 | సరూప | స్వరూప |
| 11 | 17 | రూవము | రూపము |
| 14 | 22 | రూపము | రూపమై |
| | | | |
| 2 | 9 | కర్ణైధిః | కర్ణైభిః |
| 6 | 4 | అనుభవనిచ్చుట | అనుభవించుట |
| 6 | 13 | స్వాభిష్ట | స్వాధిష్ట |
| 7 | 20 | కృక్ష | వృక్ష |
| 15 | 4 | వరేణ్య | వరేణ్యం |
| 15 | 19 | నిర్వికల్ప | నిర్వికల్ప |
| 20 | 21 | హితుడైన | రహితుడైన |
| 28 | 14 | జపి | జంపి |
| 31 | 2 | నిర్ణ | నిర్జ్ఞ |
| 31 | 6 | మహాత్మ్య | మాహాత్మ్య |
| 31 | 10 | బోధించు | బోషించు |
| 40 | 11 | వేశంబు | లేశంబు |
| 61 | 16 | సాంత్వర్షి | సాంత్వర్షి |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 65 | 1 | అవస్థలపంచీకరణ | దేహావస్థలాధిష్ఠాన ఋషిపత్నులు |
| 65 | 2 | సోహార్ద్రి | సౌహార్ద్రి |
| 73 | 17 | త్రిమూర్తు | త్రిమూర్తి |
| 74 | 8 | జ్ఞాయతే | జ్జాయతే |
| 75 | 20 | ర్యుడు | సూర్యుడు |
| 90 | 19 | నీవుః | నీవు |
| 9 | 20 | ర్వచనీయ | నిర్వచనీయ |
| 90 | 21 | రబ్రహ్మము | పరబ్రహ్మము |
| 114 | 4 | బిదూ | బిందూ |
| 114 | 14 | విషః | విష్టః |
| 120 | 21 | ర్యాకారికి | ర్యాధికారికి |

| | |
|---|---|
| పరిస్థితి | |

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA102B105 |
| పుస్తకం పేరు | 6 వ్యాస విభవము |
| తారీఖు | 25/10/26 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 161 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C1, 7A, 7C, 22A, 22B |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | thasin |
| పేజీలు విడదీసినది | nandini |
| స్కాన్ చేసినది | pratyusha |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | no |
| పరిస్థితి | good |